శ్రీరస్తు

# సభారంజని

రచయిత

శ్రీ వెలుగోటి సర్వజ్ఞకుమారయాచేంద్రబహాదరు



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు వారిచే

ప్రకటితము.

# ఉపోద్ఘాతము

కొందఱు చదువుకొన్నవారుగాను రసజ్ఞులుగాను బుద్ధిమంతులుగాను విద్యారహస్యములను దెలియ కోరికగలవారుగాను, నుండువారు నన్ను ఈదిగువ నుదహరింపబోవువిషయములు అనేకపండితజనసహాయంబుచేతను, ఆయాదేశాటనముచేసి ఆయావిద్యల పరీక్షించుటచేతను మాకు గలిగియుండు సభాయోగ్యవిద్యావిషయానుభవమునుబట్టి సంగ్రహముగా ముఖ్యములైన యంశములు సులభశైలిగా నందఱికి దెలియవచ్చునట్లు తేలికయగు లోకవాడుకమాటలతో గ్రంథమును వ్రాయవలయు నని ప్రార్థించినపైని శ్రీ వెలుగోటి బంగారు యాచేంద్ర భూపాల కుమారుండను సర్వజ్ఞ కుమార యాచేంద్రాభిధానుండను నగు నేను సభారంజని యను నీగ్రంథమును వ్రాయం బూనుకొంటిని.

# అవతారిక

గౌరవార్థముగాను శుభాదిసమయములలోను సంతోషార్థముగాను జరిపించెడు వేడుకసభలలో ముఖ్యముగా నుపయోగపడుచునుండు తౌర్యత్రికము, అనగా నృత్తగీతవాద్యములు. ఇందులో నొకటిగాగాని లేక వేరువేరుగాగాని లేక కొన్ని చేరిగాని జరిపించుట ముఖ్యచిహ్నమై యున్నది. గావున సభ్యజనోపయోగమైనది. యీతౌర్యత్రికమునకు ముఖ్యము భరతము. భరతశబ్దార్థము భావరాగతాళములు.—

ఇందులకు ముఖ్యముగా గావలసిన ప్రకరణములు ౩

మొదటిది. ఇందు స్త్రీపురుషులు రసాలంబనము లగుటచేత నాయికానాయక ప్రకరణము.

రెండవది. ఆలంబననిష్ఠరత్యాదిభావములను దెలియజేయునది రసప్రకరణము.

మూడవది. శ్లో. శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తిగానరసం ఫణీ, యను ననుభవమునుబట్టి నాయికానాయక నిష్ఠవిభావానుభావాదులను కావ్యనాట్యాదులయందు సామాజికులకు రసత్వంబున బరిణమింపజేయుటలో ముఖ్యసహాయమైన సంగీతప్రకరణంబు. పురాణము చదువుటకుగూడ రాగమావశ్యకమనుటకు సుస్పష్టజ్ఞాపకము హరివంశము శేషధర్మములో—

గీ. పదపదంబును విభజించి తుదయు మొదలు,
నేర్పడ శబ్దభావంబు తెలిసిరాగ,
సమితినైనను శ్రీరాగసరణినైన
సభనుతింప బురాణముల్ చదువవలయుం.

అనియున్నది.

కావున శృంగారరసప్రధానములైన కావ్యనాట్యాదు లందు రాగము అత్యావశ్యకమనుట కైముతిక న్యాయసిద్ధము.

నాల్గవది. తాళప్రకరణము, ఏలనంటే ఏరాగమునకు నేకృతికిని నేనాట్యమునకును లయ ముఖ్యమగుటచేతను.

ఐదవది. ఇందుకు సంబధించిన హిందూస్థానరాగతాళ ప్రకరణము. ఏలనంటే, హిందూస్థానీలు ఇచ్చటికి వచ్చి గీత వాద్యాదులు జరిపించినను లేక యిక్కడివారు హిందూస్థాన దేశమునకు వెళ్లినను తెలిసి యానందించుటకు.

ఆరవది. నాట్యాభినయప్రకరణంబు, ఏలనంటే, తాండవ వాదినాట్యములు శివుడు జరిపించియుండుటనుబట్టియు, అభి నయాదులవలన లోకస్వభావసిద్ధములయిన విభావానుభావ ములు పదార్థములు సభ్యులకు తెలిసి యానందించుటకును.

ఏడవది. గీతనృత్తాదులకు తాళలయానుసారిశబ్దవాద్య ములు ఆవశ్యకము గనుక మద్దళాదివాద్యములందు దక్షిణ వామహస్తములచే వాయించు హస్తపాటక్రమమును దెలుపు శబ్దవాద్య ప్రకరణంబును.

ఎనిమిదవది. అభినయ నాట్య గాన వాద్య అవధానరహ స్యంబులను దెలిసికొని యానందించుటకు తదనురూప సత్కార ములు వారలకు జేయుటకు పాండిత్యరహస్యప్రకరణంబును.

ఈయెనిమిదిప్రకరణంబులు వ్రాయవలసివచ్చెను.

అయితే యిప్పటివారు గ్రంథబాహుళ్యమయితే చూడ లేని యోపికగలవారగుటచే నిప్రకరణములలో నుండు సుప యుక్తాంశములను ఎత్తిసంగ్రహముగా వ్రాయుచున్నాను.

# విషయసూచిక

## శబ్దవాద్య ప్రకరణము



## పాండిత్య రహస్య ప్రకరణము



శ్రీ ర స్తు.

# స భా రం జ ని

సభారంజని యను గ్రంథమునందలి ప్రకరణముల వివరింతును:—

## నాయికానాయక ప్రకరణము

రసాలంబన మగు స్త్రీపురుషులు నాయికానాయకు లనం బడుదురు. వీరినిగూర్చి తెలుపువిషయంబు గలది నాయికా నాయక ప్రకరణ మనంబడును.

### నాయికా వివరము

ప్రసిద్ధనాయికలు, స్వీయ, పరకీయ, సామాన్య, అని మూడు విధములు.

### అందు స్వీయాభేదంబులు వివరింపబడును

స్వీయ=అనగా స్వామియందే అనురాగము గలది. ఇందు అవస్థాభేదంబులవలన గలుగు నాయికాభేదములు గల. ముగ్ధ, మధ్య, ప్రగల్భ, అని స్వీయ మూడు తెఱంగులు.

| | | |
|---|---|---|
| ముగ్ధాభేదంబులు | ... | ౪ |
| అజ్ఞాతయౌవన | ౧ | |
| జ్ఞాతయౌవన | ౧ | |
| నవోఢ | ౧ | |
| విస్రబ్ధనవోఢ | ౧ | |
| | ౪ | |
| మధ్యాభేదంబులు | ... | ౬ |
| మధ్యధీర | ౧ | |
| మధ్యాధీర | ౧ | |
| మధ్యధీరాధీర | ౧ | |
| మధ్యధీరాజ్యేష్ఠకనిష్ఠ | ౧ | |
| మధ్యాధీరాజ్యేష్ఠకనిష్ఠ | ౧ | |
| మధ్యధీరాధీరాజ్యేష్ఠకనిష్ఠ | ౧ | |
| | ౬ | |
| ప్రగల్భాభేదంబులు | ... | ౮ |
| ప్రగల్భధీర | ౧ | |
| ప్రగల్భాధీర | ౧ | |
| ప్రగల్భధీరాధీర | ౧ | |
| ప్రగల్భధీరాజ్యేష్ఠకనిష్ఠ | ౧ | |
| ప్రగల్భాధీరాజ్యేష్ఠకనిష్ఠ | ౧ | |
| ప్రగల్భధీరాధీరాజ్యేష్ఠకనిష్ఠ | ౧ | |
| సురతప్రియ | ౧ | |
| సురతానందమోహిత | ౧ | |
| | ౮ | |

ముగ్ధ = అనగా అంకురితయౌవన.

మధ్య = అనగా సమానలజ్జామదన.

ప్రగల్భ = అనగా సకలకేళికలాకోవిద. లజ్జను జయించిన కామేచ్ఛ గలదనుట.

అజ్ఞాతయౌవన = అనగా తనకు యౌవనప్రాదుర్భావమైనది తెలియకుండునది.

జ్ఞాతయౌవన = అనగా తనకు యౌవనప్రాదుర్భావమైనది తెలియునది.

నవోఢ = అనగా లజ్జాభయ పరాధీనరతిగలది.

విశ్రబ్ధనవోఢ = అనగా కొంత పరిచయముగలది.

మధ్యధీర = అనగా అన్యస్త్రీసంభోగమువలన పతియందు వ్యంగ్యముగా కోపప్రకాశము చేయునది.

మధ్యాధీర = అనగా అన్యస్త్రీసంభోగమువలన పతియందవ్యంగ్యముగా పరుషవాక్యంబులు పలుకునది.

మధ్యధీరాధీర = అనగా అన్యస్త్రీసంభోగమువలన పతియందువ్యంగ్యవచనంబు చేయుచు వెంబడే అవ్యంగ్యమైన కోపచేష్టగలది.

జ్యేష్ఠకనిష్ఠ = అనగా నిద్దఱుభార్యలయందు పతికిగల యధిక న్యూనస్నేహములవలన నేర్పడునవి. ఆస్త్రీ సమయములో తన యందుగల న్యూనస్నేహంబు నెఱిగి పతియందు కోపప్రకాశము చేయుటలో నెగువ వ్రాసిన ధీరాధీరాదిలక్షణంబులు గలయవి.

ప్రగల్భధీర = అనగా అన్యస్త్రీసంభోగముచేసి వచ్చిన పతియందు రత్యుదాసీనభావముగలది.

ప్రగల్భాధీర = అనగా అన్యస్త్రీసంభోగముచేసి వచ్చిన పతియందు తర్జనతాడనాదులు చేయునది.

ప్రగల్భధీరాధీర = అనగా అన్యస్త్రీసంభోగముచేసి వచ్చిన పతియందు రత్యుదాసీనభావముగలిగి తర్జనాదులు చేయునది.

జ్యేష్ఠకనిష్ఠాదిభేదంబులు ప్రగల్భకుంగలవు, తనయందుండు న్యూనస్నేహము నెఱిగి పతియందు కోపప్రకాశము చేయుటలో ప్రగల్భకు జెప్పియుండు ధీరాధీరాది లక్షణంబులు గలయవి.

**పరకీయాభేదంబులు వివరింపబడును**

పరకీయ = అనగా అప్రకటితపరపురుషానురాగ: అనగా పరపురుషానురాగమును గోపనముచేయునది. ఇందులో కన్య, పరోఢ అని ౨ భేదములు.

కన్య = అనగా అవివాహితురాలై తల్లిదండ్రుల అధీనములో నుండి జారవ్యాపారముగలది.

పరోఢ = అనగా వివాహితురాలై జారవ్యాపారము గలది. ఇందులో ననేకభేదము లుండినను ప్రాచీనోక్తంబులై ప్రసిద్ధములైన కొన్ని భేదంబులు వ్రాయబడుచున్నవి.

౧ గుప్త = అనగా జారసురతమును గోపనముచేయునది. ఇందు మూడు భేదంబులు. వృత్తసురతగోపన = అనగా జరిగిన జార సురతమును గోపనముచేయునది. వర్తిష్యమాణ

సురతగోపన = అనగా జరుగబోవు జారసురతమును గోపనము చేయునది. వృత్తవర్తిష్యమాణసురతగోపన = అనగా జరిగిన జారసురతమును జరుగబోవు జారసురతమును గోపనము చేయునది.

౨ విదగ్ధ = అనగా తనమనోభిప్రాయము నితరులకు తెలియకుండ జారునికి మాత్రము తెలుపునది. ఈవిదగ్ధ రెండు విధములు. వాగ్విదగ్ధ = అనగా వాక్చాతుర్యముచే తెలుపునది. క్రియావిదగ్ధ = అనగా క్రియలచేత తెలుపునది.

3 లక్షిత = అనగా కొంతబయలుపడిన జారసురత వ్యాపారముగలది.

౪ కులట = అనగా బహుపురుషానురాగముగలది.

౫ అనుశయాన = అనగా సంకేతస్థానాసంపర్కమును చింతించునది. ఇందులో 3 భేదములు.

౧ వర్తమానసంకేతస్థలాసంపర్కమునుచింతించునది.

౨ భావిస్థానసంకేతస్థలాసంపర్కమునుచింతించునది.

3 పతిప్రాప్తమైన సంకేతస్థలమును ఆసంపర్కముచేత పొందజాలక చింతించునది.

౬ ముదిత = అనగా తనకు సమయముదొరికినదనిజారునికి తెలుపుటకు సంతోషించునది.

౭ సాహసిక = అనగా పతి సమీపములోనుండగా పతినివంచించిజారునితో రతిసల్పునది.

౮ ప్రతిభాచతుర = అనగా తనరంకుతనము కొంత బయలుపడినను సమయోచితముగా తెలియరాకుండా "కలగని మేలుకొంటిని" అను బొంకువలెబొంకునది.

౯ కలహాంతరిత = అనగా తనజారత్వమును అవమానించి రోషము చేసి తనయందు పతికి కనికరము పుట్టించునది.

**సామాన్యా భేదంబులు వివరింప బడును**

సామాన్య = అనగా ద్రవ్యనిమిత్తంబుగా సకల పురుషులయందు సామాన్యము గలది.

ఈసామాన్యలలో జాతిసామాన్య, ఆగంతుక సామాన్య, గూఢసామాన్య, అను మూడు భేదములు

జాతిసామాన్య = అనగా వివాహితురాలు గాక తన జాతి రీత్యాపైన చెప్పిన లక్షణంబు గలయది

ఆగంతుకసామాన్య = అనగా వివాహితయైు వెనుక పతిని విడిచి విచ్చలవిడిగా పైన జెప్పినప్రకారము వర్తించునది.

గూఢసామాన్య=అనగా వివాహితురాలైనను కాక గాని పతిగతించిన వెనుకగాని యింటివారియొక్క అనుమతిమీద పైజెప్పినలక్షణప్రకారము గూఢముగా సంచరించి ద్రవ్యము సంపాదించి పోషకులకు యిచ్చుచున్నది. ఈగూఢ సామాన్యను ప్రాచీనులొప్పలేదు గాని మనుధర్మశాస్త్రములో ఈస్త్రీయొక్క పతిని పురుషునికి వ్యభిచారదోషజనకముగా జెప్పలేదు గాన సామాన్యలలో సంస్థాపనము చేయవలయును.

ఇక ప్రాచీనోక్తములయిన స్వీయలలో గలుగు ముగ్ధా మధ్యాప్రౌఢలయందును పరకీయాసామాన్యలయందును గలుగు అష్టవిధనాయికల వ్రాయుచున్నాను.

౧ స్వాధీనపతిక=అనగాపతి, స్వాధీనుడుగాగలది.

౨ వాసకసజ్జిక = అనగా ప్రియుడువచ్చుసమయమునకు తన్ను కేళికాగృహమును అలంకరించుకొని ప్రియాగమనమును ప్రతీక్షించునది.

3 విరహోత్కంఠ=అనగా పతిరానందున విరహముచేత శ్రమనొందునది.

४ విప్రలబ్ధ = అనగా సంకేతస్థలమునందు పతిని గానక చింతించునది.

౫ ఖండిత = అనగా అన్యస్త్రీసంభోగమువలన నాయకునిపై రోషించునది.

ఇందులో భావిఖండితగలదు, అనగా పతి అన్యస్త్రీసంభోగము చేసెనని తెలిసికొని పతివచ్చిన పిదప కోపించవలెనని యుద్యుక్తురాలై యుండునది.

౬ కలహాంతరిత = అనగా ప్రియుని రోషించి వెడల గొట్టి యనంతరము పశ్చాత్తాపపడునది.

2 ప్రోషితపతిక = అనగా పతిదేశాంతరము పోయినం దున విరహము చే చింతించునది.

౮ అభిసారిక = అనగా ప్రియుడుండు స్థలమునకుపోవునది. ఇందుజ్యోత్స్నాభిసారిక = అనగా వెన్నెలలో ప్రియునింగూర్చిపోవునది. తమోభిసారిక = అనగా చీకటిలో ప్రియునింగూర్చి పోవునది. ఇ ట్లనేకభేదంబు లూహ్యంబులు.

మఱియు నాథునికు లేర్పఱచిన నాయికలు ప్రవత్స్యత్పతిక, ప్రవసత్పతిక, సమాగమిష్యత్పతిక, సమాగచ్ఛత్పతిక అని నల్వురు గలరు.

౧ ప్రవత్స్యత్పతిక=అనగా ప్రియుడు దూరదేశమునకు బోవుచున్నాడని భావివిరహమును దలచి దుఃఖించునది.

౨ ప్రవసత్పతిక=అనగా దేశాంతరముబోయెడు ప్రియుని జూచి భావివిరహమును గురించి దుఃఖించునది.

3 సమాగమిష్యత్పతిక = అనగా ప్రియుడు దేశాంతరమునుండి రాబోవునని సంతసించునది.

౪ సమాగచ్ఛత్పతిక =అనగా ప్రియుడు దేశాంతరమునుండి వచ్చుచుండగా చూచి సంతోషించునది.

స్వాధీనపతికాదులగు నీ భేదములన్నియు పైజెప్పిన స్వీయా పరకీయా సామాన్యలకును గలుగు భేదములు గాబట్టి విప్రలబ్ధవాశకాదియైన ముగ్ధ, మధ్య, ప్రగల్భ, పరకీయ, సామాన్య, ఈనాయికల ప్రసిద్ధలక్షణములతో ఈ అవాంతర భేదములు చేరియుండునని చూచుకొని వాట్లవాట్లయొక్క అవాంతర భేదముల నిరూపించేసి నాయికనిర్దేశముచేయవలెను.

## మానవతి

మానవతి = అనగా ప్రియునియం దన్యస్త్రీ ప్రయుక్తముగా గోపించుటచేతను దానికి బ్రియుడుచేయు మానశాంతియనుబట్టి యేర్పడునది.

ఇందు లఘుమాన, మధ్యమాన, గురుమాన, అని 3 భేదములు.

౧ లఘుమాన = అనగా అన్యస్త్రీని ప్రియుడు చూచుటచే గలుగుకోపముగలది. ఇది ప్రియుడు ఉపలాలించుటచే మానశాంతిగలుగునది.

౨ మధ్యమాన = అనగా ప్రియునికి ప్రీత్యతిశయము చేత హఠాత్తుగా మఱియొకస్త్రీ నామోచ్చారణచేయుటచే నతని యందు కోపముగలది. ఇది పురుషుడు ఆన పెట్టుకొనుటవలన మానశాంతిగలుగునది.

3 గురుమాన = అనగా అన్యస్త్రీ సంభోగచిహ్నముల వలన గలుగుకోపముగలది. ఇది పాదప్రణామమువలన మాన శాంతిగలుగునది.

తృప్త, అతృప్త, తృప్తాతృప్త అని మూడునాయికలు కలరు.

౧ తృప్త = అనగా పురుషరతిచే తృప్తి జెందునది.

౨ అతృప్త=అనగా పురుషరతి వలన తృప్తిజెందనిది.

3 తృప్తాతృప్త = అనగా పురుష రతి వలన కొంత తృప్తయై కొంత యతృప్తగా నుండునది. అనగా స్త్రీలకు రజో నిర్గమన మూత్రనిర్గమన ద్వివిధమార్గములవలన స్ఖలనం బులు గలుగుటగలదు అందు నొక్కమార్గంబున స్ఖలనమైతృ ప్తింజెంది రెండవ మార్గస్ఖలనాపేక్షగలిగి యుండునది. ఇది కళా శాస్త్రానుభవద్వయసిద్ధము.

మఱియు గర్వితలో అయిదుభేదంబులు- గర్విత=అనగా గర్వించునది.

౧ సౌందర్య గర్విత = అనగా తనయందు గల సౌంద ర్యముచేత గర్వించునది.

౨ ప్రేమగర్విత = అనగా పతికి తనయందు విశేషప్రేమ గలదని గర్వించునది.

3 విద్యాగర్విత=అనగా చదుచు చదనముచే గర్వించునది-

౮ యౌవనగర్విత = అనగా పడుచుదనముచే గర్వించునది.

౯ కులగర్విత = అనగా నెక్కువ కులముచే గర్వించునది. ఇందులో మొదటి రెండు ప్రాచీనులు ఒప్పినవి గర్వితకు వక్రోక్తియుండవలసినట్లు ప్రాచీనుల యభిప్రాయము వక్రోక్తితో సంతగా ఆవశ్యకత గానరాదు. ఉండెనేని మఱియు యుక్తము.

అన్యసంభోగ దుఃఖిత = అనగా తన ప్రియుడు మఱియొకస్త్రీతో గ్రీడించితే ఆస్త్రీయందుగల చిహ్నములను జూచి దుఃఖపడునది. దీనికిని ప్రాచీనులు వక్రోక్తి యుండవలసిన దనియు సంభోగచిహ్నములు గలది అనాయికయొక్క దాసిగా నుండవలెననియు సంకేతము చేసియున్నారు కదాచిత్తుగా నట్లు లేకయుండ గలుగవచ్చును.

ఉత్తమ = అనగా ప్రియు డహితంబు చేసినను దాను హితమే చేయునది.

మధ్యమ = ప్రియుడు చేయు హితాహితంబుల ప్రకారము తానును హితాహితంబులు చేయునది.

అధమ = అనగా ప్రియుడు హితంబుచేసినను తా నహితంబునే చేయునది.

పద్మిని, చిత్తిని, శంఖిని, హస్తిని, అని స్త్రీ జాతులు నాలుగు గలవు. ఈ జాతులకు అనుగుణము లగు పురుషజాతులు పద్మినికి పాంచాలుడు, చిత్తినికి కూచిమారుడు, శంఖినికి భద్రుడు, హస్తినికి దత్తుడు, అని నాలుగు గలవు.

ఈ స్త్రీపురుషజాతుల నిర్ణయము అవయవములయొక్క ప్రమాణభేదమునుబట్టి యేర్పడుచున్నది.

దీనింబట్టి స్త్రీపురుషులరతులను నీచోచ్చసమరతులను నాలుభేదంబులు కలాశాస్త్రమునందు జెప్పబడియున్నవి. చూడుడు.

దివ్య = అనగా దేవతాస్త్రీ.
అదివ్య = అనగా మనుష్యస్త్రీ.
దివ్యాదివ్య=అనగా దేవతాస్త్రీ మనుష్యస్త్రీగా బుట్టినది.

ఇవన్నియు స్వీయాపరకీయాసామాన్యలందు అవస్థాభేదములచేతను అవాంతరభేదములచేతను యథాసంభవములుగా ననేకభేదములు గలుగుచున్నవి.

మఱియు కలహాంతరిత, మొదల ఖండితావస్థచే రోషించితే, భర్త వెళ్లిన తర్వాత విరహోత్కంఠావస్థతో వెనుక పశ్చాత్తాపపడునది.

విప్రలబ్ధ, మొదల అభిసారికావస్థనుబొంది భర్తఅచ్చట లేనందున విరహముచేత చింతించునది.

ఇట్లు రెండేసి నాయికావస్థలు ఒక్కొక్కనాయికకే యథాసంభవముగా గలుగవచ్చును.

## నాయికాసహాయులు

౧ దూతి = అనగా నాయికానాయకులకు అన్యోన్యసందేశమును జెప్పునది.

౨ దాసి = అనగా పరిచర్యచేయునది.

3 సఖి = అనగా సమానవయస్కయగుచెలికత్తె.

౪ చేటి = అనగా సంధానచతుర.

౫ ధాత్రేయి = అనగా దాదికూతురు.

౬ ప్రాతివేశిని = అనగా ప్రియునియొద్దకు వెళ్లుటకు ప్రోత్సాహపఱచునదిగాని, పొరుగింటిదిగాని యర్థము.

౭ లింగిని = అనగా తపోయోగిని.

౮ శిల్పిని = అనగా మకరికాపత్త్రాదులు వ్రాయునది.

౯ సైరంధ్రి = అనగా సంచారిగానుండి రాజస్త్రీల కలంకారము చేయునది.

౧౦ శిక్షిక = అనగా ప్రియునియొద్ద నడుచుకొనవలసిన రీతులు చెప్పునది.

౧౧ పరిహాసిక = అనగాహాస్యము చేయునది.

౧౨ నర్మసఖి = అనగా తన నర్మమర్మములను తెలుపందగినంత స్నేహముగలది.

మఱియు, పరకీయకు లజ్జయుండుటచే జారత్వాపేక్ష గలుగకుండుట గలదని, సామాన్యకు మాతృప్రవేశాదులవలన లజ్జ నివర్తించి యుండవలెనని, పరకీయాసామాన్యలకు ముగ్ధామధ్యాభేదములు గలుగవని ప్రాచీనులు వ్రాసియున్నారు. రసమంజరీవ్యాఖ్యాతలు ఆమోద పరిమళ వ్యంగ్యార్థకౌముదీ కారులు పైనాయికలకు విస్రబ్ధనవోఢా, మధ్యాదిలక్షణములు గలుగ నొప్పునని వ్రాసియున్నారు.

మఱియు, అన్యసంభోగచిహ్నదర్శనజనితకోపప్రకాశకత్వముగల ధీరాధీరాత్వాదిభేదంబులు లజ్జాపూర్ణయగు స్వీయాముగ్ధకు గలుగవని ప్రాచీనులు వ్రాసిరిగాని తద్వ్యాఖ్యాతలుమాత్రము "నవోఢలకు ఖండితాత్వకలహాంతరితాత్వ

భేదములను వారే వ్రాసియున్నపుడు ధీరాత్వాదిభేదము లేల కలుగగూడదని యాక్షేపించి వ్రాసిరి. కావున వ్యాఖ్యాతల యభిప్రాయమంద నే నేకీభవించితిని, దీనివలన రసమంజరి యందు నవీనపక్షముగా నాయికాభేదములు గల్పించినట్లయితే రసమంజరిలో జెప్పకపోయినను బై నాయికలను నిర్ణయింపవచ్చును.

## నాయకులవివరము

### నాయకులు.

౧ అనుకూలుడు = అనగా స్వస్త్రీయందే యెప్పుడా ప్రీతి గలవాడు.

౨ దక్షిణుడు = సమమును సహజమును నగు ప్రీతిగలిగి సమస్థతయు దక్షత్వమునుగలవాడు.

౩ ధృష్టుడు = అపరాధియగు తన్ను వెళ్లగొట్టినను బోక నాయికకు బ్రియంబులాడువాడు.

౪ శఠుడు = కాంతలయందు కపటమునేయు నేర్పు గలవాడు.

౫ పతి = వివాహితుడు.

౬ ఉపపతి = జారుడు.

౭ వైశికుడు = వేశ్యాసక్తుడు - ఈవైశికులలో, ఉత్తముడు=ప్రియురాలు కోపించినను, నుపచరించువాడు.

మధ్యముడు = ప్రియురాలు కోపించినపుడు తనకుగల్గిన కోపానురాగంబులు ప్రకటింపక, తచ్చేష్టచేత మనోభావంబు లెఱుంగవలెనని యూరకుండు వాడు.

అధముడు = లజ్జాభయశృంఖలనుమాని కామక్రీడయందు గ్రాహ్యాగ్రాహ్య విచారంబులేనివాడు.

పతి, ఉపపతి, వైశికుడు అనుమువ్వురికి స్త్రీలకుగల యవస్థాంతరభేదములు గలుగ వచ్చును, ఈర్ష్యామాన ప్రయుక్తభేదములుతప్ప తక్కినవి గలుగవచ్చును, ఏలనంటే ఈ నాయకులలో సర్వపురుష రతివిషయకేర్ష్యామాన ప్రయుక్త భేదములు గలుగునేని "యోషితో బహవః క్లిశ్యా," అను ప్రకారముగ రసాభాసత్వము గలుగును గావున, ఖండితా, ధీరాధీరా, మానవతీత్యాదులగు స్త్రీభేదములుతప్ప తక్కినవి యథాసంభవములుగా గలుగవచ్చును, వానికి బుంలింగవాచకము లగునామనిర్దేశము చేసికొనవలయును.

పీఠమర్దాదులు—౪

౧ పీఠమర్దుడు = నాయకునికంటె కొంచెము తక్కువ సామర్థ్యముగలవాడు. కుపితయైన నాయికను బతిమాలి దనుగ్రహముగలుగజేయువాడు.

౨ విటుడు = కళాశాస్త్రమునందు మాత్రము సామర్థ్యము గలవాడు.

౩ చేటుడు = నాయికానాయక సంధానచతురుడు.

౪ విదూషకుడు=అంగవికారాదులచే బరిహాసించువాడు.

మహానాయకులు—౪.

౧ ధీరోదాత్తుడు = స్థైర్యము, కరుణ, సత్యము, మనోదేహబలములును గలవాడు.

౨ ధీరోద్ధతుఁడు = శౌర్యము దర్పము వంచనయుగల వాఁడు.

3 ధీరశాంతుఁడు = శాంతియు బుద్ధియు గలిగి యొకెం టిచే బ్రసన్నుఁడైనవాఁడు.

౪ ధీరలలితుఁడు = సమస్తభోగములుగలవాఁడు.

నాయికానాయకప్రకరణము సమాప్తము.

---

# రసప్రకరణము.

ఆలంబనోద్దీపనత్వాదిభావములను దెలుపువిషయంబులు గలది రసప్రకరణము అనంబడును.

అనేక పదార్థములు గలిసినజలము పానకరసాయన ముగా నెట్లేర్పడునో అట్లు విభావానుభావసాత్వికసంచారీభావ ములు కలిసిన స్థాయీభావము రసరూపముగా నేర్పడుచున్నది.

ఈరసము ౯ విధములని ప్రాచీనకవిసంకేతము.

౧ శృంగారము, ౨ హాస్యము, 3 కరుణ, ౪ వీరము, ౫ భయానకము, ౬ భీభత్సము, ౭ రౌద్రము, ౮, అద్భుతము, ౯ శాంతము. ఈనవరసములకు స్థాయీభావములు

౧ రతి=స్త్రీలకుపురుషులకు గలుగుసంభోగవిషయకాభి లాష.

౨ హాస్యము = హాస్యాస్పదములైన చేష్టాదులచే గలుగు మనోవికాసము.

3 కరుణ = బంధుజనమరణాదులచేత గలుగుదుఃఖము.

౪ వీరము = లోకోత్తరకృత్యములుచేయు నతిప్రయత్నము. ఈవీరములో దానవీర, దయావీర, యుద్ధవీర, క్షమావీరములని ౪ భేదములు. ఇందులో వాత్సల్యము అనునది దయావీరములో చేరియున్నదని ప్రాచీనులుచెప్పియున్నారు.అది సరికాదు, ఏలనంటే శరణాగతుండైనవానిని రక్షించుటయందు దయావీరమున కుపయోగమేగాని శిశువులయందు గలుగు వాత్సల్యము నిర్హేతుక నైజరీతియు శిశుసంరక్షణార్థము చేష్టలం కలుగజేసినదియుగాన ప్రత్యేకముగా వాత్సల్యరసమని చెప్పబడవలెనని నవీనవ్యాఖ్యాతల సిద్ధాంతము.

౫ భయానకము = క్రూరాకారము జూచుటవలనను అనర్థావహ మగుమాట వినుటవలనను గలుగుభీతి.

౬ భీభత్సము = దుర్గంధరూపాస్థిమాంసమలాదులు చూచుటవలన గలుగునసహ్యము.

౭ రౌద్రము = అపకారముచేత మనస్సుప్రజ్వలించునది.

౮ ఆశ్చర్యము = అపూర్వము లయినవస్తువులను జూచుటవలనను, సంగతులు వినుటవలనను, మనస్సునగలుగు నాశ్చర్యము.

౯ శాంతము = విషయవైరాగ్యమును గలిగించు మనోనిశ్చయము. ఈ స్థాయీభావముల కన్నింటికి విభావానుభావ సాత్త్వికసంచారిభావములు గలవు శృంగారరసమునకుమాత్రము ఈక్రింద వివరింపబడుచున్నవి.

తక్కినవానికి నివేదితగ యథాసంభవములుగ గలుగు వానిం జూచుకొనవలయును.

ఈశృంగారరసకారణమైన విభావము రెండువిధములు.

౧ ఆలంబనము = రతి యనుస్థాయీభావము, శృంగార రసము, యెవరినాశ్రయించి కలుగుచున్నవో అట్టి రూపవిశిష్ట స్త్రీపురుషులు ఆలంబనము.

౨ ఉద్దీపనము = స్త్రీపురుషులకు గలిగిన రతిచ్ఛను వృద్ధి పొందించునది. అనగా ప్రాయము, సొమ్ము, చేష్టయు, తటస్థులైన మలయానిలచంద్రమదనసఖశుకపికారావాదులు.

అనుభావము = కారణమైన విభావముచేత అంతఃరస ముత్పన్నమై వృద్ధిపొందు దాని ననుసరించి, బాహ్యతః ప్రకాశింపజేయు కటాక్షభుజాక్షేపాదులు.

సాత్త్వికభావములు—౮

౧ స్తంభము = ఏమియు దోచకుండుట.
౨ ప్రళయము = అతిమోహముచే నగుమూర్ఛ.
౩ జృంభణము = కన్నీళ్లు.
౪ స్వేదము = చెమట.
౫ విస్వరత్వము = గద్గదవాక్యము.
౬ రోమహర్షణము = పులకాంకురము.
౭ కంపము = వణకుట.
౮ వివర్ణత = వెలవెలబోవుట.

ఈసాత్త్వికభావములను కొందఱాలంకారికులు యెత్తుకొనలేదు ఏలనంటె శ్రీరామాదులకు గలుగు సాత్త్వికాదులు అనుభావములలో జేరుచున్నవనియు, కొందఱు శ్రీరామాది నిష్టసుఖదుఃఖాదులను సభ్యులు కావ్యనాట్యాదులందు భావిష్టి

సత్త్వస్ఫురణమువలన వ్యక్తమయుండు నవి ప్రకాశించుటచే సాత్త్వికములని యున్నందున నివి రసకారణములు గావనియు అయితే యివ్యలకు విభావానుభావసంచారిభావములచే గలుగు రసమున కనుభావములగుటచేత రసకార్యములలో జేరుననియు సాత్త్వికభావములను ఎత్తివేసినారు.

## సంచారిభావములు. 33

ఇవి ప్రాథమికసంభోగేచ్ఛయనురతికి విచ్ఛిత్తిగలుగకుండ ప్రత్యేకావస్థాయిగా వెంటవెంట ననుసరించి సహచారులుగా బుట్టునవిగాన సంచారు లనంబడును.

౧ నిర్వేదము=దేనియందు నిచ్ఛలేకుండుట.

౨ శ్రమ=విరహాదులచే జెమటపోడమునంత మనశ్శరీర కష్టములు.

౩ దైన్యము=దీనత్వముచే మదనాదుల బ్రార్థించుట.

౪ జాడ్యము=ఏమియుం దోచకుండుట.

౫ గ్లాని=శక్తితగ్గి బడలికగల్గుట.

౬ త్రాసము=చంద్రాదులజూచి భయపడుట.

౭ శంక=తనయిష్టము సిద్ధించునో లేదో యని సంశయించుట.

౮ ఆర్తి=మన్మథజ్వరముచే గలుగుతనుపీడ.

౯ రోషము=తనకు అపరాధముచేయు మదనాదులందు గలుగుకోపము.

౧౦ గర్వము = నాతో నితరులు సరివత్తురా యని యొరుల న్నిందించి తన్ను బొగడుకొనుచిత్తౌన్నత్యము.

౧౧ ఆవేగము = ఇష్టానిష్టప్రాప్తివలన గలుగు మనస్సంభ్రమము.

౧౨ ధృతి=మనమున గృతార్థత్వమును బొందుట.

౧౩ స్మృతి=పూర్వ మనుభవించినదానిని దలచుకొనుట.

౧౪ చాపలము=రాగద్వేషజనితచేష్టాద్యనవస్థ.

౧౫ ఉగ్రత=తనకు ఎగ్గుగలిగినచో గలుగుకోపము.

౧౬ అవహిత్థ = తన మనోభావప్రకాశకమైన ఆకారమును మరుగుపఱచుట.

౧౭ త్రప = మనస్సంకోచము.

౧౮ విషాదము = వివిధోపాయభంగము.

౧౯ మదము = ఆసవపానాదులవలన గలుగు వ్యవస్థాసహితసంతోషము.

౨౦ ఔత్సుక్యము = సమయాక్షమత్వము, లేక జాగు నోర్వజాలమి.

౨౧ మతి = అర్థవినిర్ణయము.

౨౨ నిద్ర = చిత్తనిమీలనము.

౨౩ మోహము = మూర్ఛ.

౨౪ బోధము = మేల్కొనుట.

౨౫ మృతి = మరణోద్యోగము.

౨౬ ముదము=ఇష్టప్రాప్తివలన గలుగు సంతోషము.

౨౭ ఆలస్యము = చేయదగినకార్యములయందు మందోద్యోగము.

౨౮ వితర్కము = సందేహబాహుళ్యము.

౨౯ సుప్తి = అతినిద్ర.

౩౦ అసూయ=పరుల యతిశయత్వము సహింపకుండుట.

౩౧ ఆధ్యానము=ఇష్టసిద్ధి కానందున దానినే చింతించుట.

౩౨ భ్రమము=చేతనాచేతనజ్ఞానము లేక ముచ్చటించుట.

౩౩ అపస్మృతి = మన్మథావేశముచే గలుగు విపరీత వికారములు.

ఈభావములన్నియు నన్ని రసములయందు నన్ని గలుగవు. యథాసంభవములుగా నగువాట్లను మాత్రము చూచుకొనవలయును.

## శృంగారచేష్టలు ౧౮

౧ భావము=రసాభిజ్ఞానయోగ్యతామాత్రము.

౨ హావము=ఆభావము కొంచెము స్ఫుటమగుట.

౩ హేల=ఆభావమే బాగుగ ప్రకాశించుట.

౪ విలాసము=ప్రియునిం జూచి స్త్రీకి గలుగు తాత్కాలిక చేష్ట

౫ మాధుర్యము = రత్యాదిసమయములలో భూషణములు లేకనే మిక్కిలి ప్రకాశించుట.

౬ ధైర్యము = అతిమోహము గలిగినను గులశీలాదుల నతిక్రమింపకుండుట.

౭ విభ్రమము = ప్రియునియందే యుండు తలంపుచేత భూషణాదులను వ్యత్యస్తముగా ధరించుకొనుట.

౮ లీల = ప్రియునియొక్క గుణముల ననుసరించుటచే బ్రకాశించుట.

౯ కిలికించితము = ఉలిక్కిపడుట, వెంబడే కోపపడుట, వెంబడే సంతోషపడుట, తదనుగుణమైన యశ్రుప్రలు నించుట, ఈ నాలుగుగూడిన చేష్టావిశేషము.

౧౦ మోట్టాయితము = కథాదులచే స్వయిష్టమును తెలుపుట.

౧౧ లలితము = సొగసగు దేహవిన్యాసము.

౧౨ విచ్ఛిత్తి = సొమ్ము లల్పముగానుండినను ప్రకాశించుట.

౧౩ బిబ్బోకము = ప్రియునికథయం దనాదరము.

౧౪ విహృతము = తనయంగీకారమును తెలుపవలసిన సమయమున నూరకుండి క్రియలచే తెలుపుట.

౧౫ చకితము = తనమౌగ్ధ్యముచే భయపడుట.

౧౬ హాసితము = సంతోషంబునంగలుగు నవ్వులను ప్రకాశించుట.

౧౭ కుట్టమితము = సురతానందముచేత దంతక్షతాదులను గుత్తెలుగకుండుట.

౧౮ కుతూహలము = ప్రియవిషయకమోహచాపల్యము.

## స్త్రీలయందు గలుగు దశావస్థలు

౧ చక్షుఃప్రీతి = ప్రియునిం బ్రీతితో జూచుట.

౨ చింత = ప్రియ సంఘటనవిషయక చింత.

౩ సంస్మృతి = ప్రియునిం దదేకనిష్ఠగా ధ్యానించుట.

౪ గుణకీర్తనము = ప్రియుగుణములు గొనియాడుట.

౫ అరతి = ప్రియవిషయకమోహంబున, దేనియందు నిచ్ఛలేకుండుట.

౬ తాపము = మోహంబున తపించుట.

౭ లజ్జాత్యాగము = ప్రియునియందుగలుగు మోహము అతిశయించినందున, లజ్జవిడిచి యందఱితో జెప్పుకొనుట.

౮ గమనము = ప్రియునియొద్దకు దానే బోవుట.

౯ మూర్ఛ = అతిమోహంబున మూర్ఛిల్లుట.

౧౦ ధన్యత = ప్రియలాభమునంగల్గు నిష్టసిద్ధిచే తృప్తి నొందుట.

## శృంగారము ౨ విధములు

౧ సంభోగశృంగారము = అనగా బాహ్యాభ్యంతర రతులుగలది.

బాహ్యరతి = అనగా ఆలింగన నఖక్షత దంతక్షత చుంబనాది భేదములుగలది.

అభ్యంతరరతి = అనగా చౌశీతి బంధభేదములతో జేసినయది.

౨ విప్రలంభశృంగారము = అనగా ఇందు పెక్కుభేదములు గలవు.

అందుప్రసిద్ధంబులు—౪

౧ అభిలాష = అనగా సంభోగాత్పూర్వము గలుగు మోహము.

౨ విరహము = అనగా కలిసి యెడబాయుటచే గలుగు పరితాపము.

3 ప్రవాసము = అనగా ప్రియుడుగాని తానుగాని దేశాంతరములో నుండుటచే గలుగు విరహము.

౪ మానము = ఇవి ౨ విధములు.

ప్రణయమానము = అనగా నిష్కారణముగనే ప్రియుని యందు కోపముగలుగుట.

ఈర్ష్యామానము = అనగా అన్యస్త్రీ సంభోగజనిత కోపము.

ఈర్ష్యామానము మాత్రము పురుషులకు గలుగదు గల్గినయెడ రసాభాసమగును, తక్కిన విప్రలంభశృంగార భేదము లన్నియు, నీనాలుగింటిలో నంతర్భూతములు.

### రసాభాసములు

౧ స్త్రీపురుషులలో నొకరికి ప్రీతిలేక యొకరికుండుట.

౨ నీచులరతిని అభివర్ణించుట.

3 ఒక స్త్రీకి ననేక పురుషులయందు నేకకాలములో ననురాగమున్నట్లు చెప్పుట.

౪ అనేకపురుషులకు నేకకాలములో నొకస్త్రీయందు మోహము గలుగుట.

౫ ఉత్తమ జాతిస్త్రీకి నీచునియందును ఉత్తమునికి నీచస్త్రీయందును సౌందర్యవతికి కురూపియందును కురూపికి సౌందర్యవతియందును యౌవనస్త్రీకి వృద్ధునియందును యౌవన పురుషునికి వృద్ధస్త్రీయందును రతిగల్గుట రసాభాసమనంబడును, పశుపక్ష్యాదుల రతులవర్ణించుటయు: ప్రాచీనులు రసాభాసము క్రింద చేర్చినారుగాని, "అదోషౌ సగుణౌ సాలంకారౌ, శబ్దార్థౌ కావ్యం" అనులక్షణముతో జేరిన మహాకావ్యముల

యందు పశుపక్ష్యాది రతులును వర్ణింపబడుచున్నవి, గావున నవి రసాభాసములని చెప్పఁగూడదు. ఇకను దీనికి గతియేమన్నను, పశ్వాదుల రతినిజూచి స్త్రీపురుషులకు వానియందు మోహము గలిగినట్లు చెప్పుట రసాభాస మనవలసినట్లు తోఁచుచున్నది.

౧ భావోదయము = అనగా ప్రథమతః ఒకభావము గలుగుట.

౨ భావశాంతి = అనగా గలిగిన మోహేర్ష్యాది భావములు శమించుట.

3 భావసంధి=అనగా నొకరికిగలిగినభావముచూచు మఱియొక్కరికి భిన్నభిన్నరసగతభావములుగా వారివారికిదోఁచుట.

౪ భావశబలత = అనగా ఏకరసగతభావములుగాని భిన్నరసగతభావములుగాని పూర్వపూర్వోపమర్దములుగా భావములు పుట్టుచు నివర్తించుచు దిరిగి పుట్టుచు నీరీతిగ ననేకభావములు గలుగుట.

రసము అనునది విభావానుభావ సాత్త్విక సంచారీ భావములవలన గలుగు సుఖవిశేషము. అయితే కరుణ, భయ, బీభత్సాదు లనుభవించువారికి సుఖవిశేషముగా నెట్లున్నపుడి రసత్వవ్యవహారము గలుగునని యాక్షేపముదోఁచును. అట్లుగాదు, ఎట్లనగా రత్యాదులయిన ఈ తొమ్మిదియు ననుభవించువారికి రసత్వేనపరిణమింపవు ఇకనేమంటే కావ్యనాట్యాదులందు, శ్రోతృద్రష్టలగు సభ్యులకు అందు వర్ణింపంబడు రామాదిగత విభావానుభావ సాత్త్వికవ్యభిచారిభావములు ముద్రితాముద్రిత

న్యాయముగా సభ్యబుద్ధి ప్రతిఫలితములయి వారలకు సుఖరూపమై రసత్వంబున పరిణమించుచున్నది గాన రత్యాదులయిన యీతోస్మిదంటి ననుభవించువారికి సుఖహేతువులుగావు.

అయితే శృంగారము అనుభవించువారికి సుఖహేతువుగాదా? యనియందుకు, సంభోగశృంగారము నాయికా నాయకులకు సుఖరూపము గావచ్చునుగాని విప్రలంభమునందు గలుగు దశావస్థలు అనుభవించువారికి సుఖహేతువులగునా? గావున సభ్యులకే సుఖహేతువులగును.

అయితే కావ్యనాట్యాదులయందు రాములకుగలుగు సీతావియోగదుఃఖము పట్టువచ్చినప్పుడు సభ్యులకు గన్నీళు గాఱలేదా? గనుక వీరలకుమాత్రము సుఖహేతువు లెట్లగు నని శంకింతురు, అట్లుగాదు సభ్యులకు రామాదినిష్ఠ దుఃఖమును జూచి యశ్రువులువచ్చుట సుఖాంశకమయిన దుఃఖమేగాని వాస్తవదుఃఖముగాదు. ఎట్లన, వాస్తవదుఃఖమైతే, ఎవరేని కావ్యనాట్యాదులను వినను జూడనుంగోరుదురా? కాబట్టి సామాజికులకే రసానుభవము - ఈసంగతి పండితరాయలవారు చెప్పిన రసగంగాధరములో నిందుల విస్తారము వ్రాయబడియున్నది చూడుడు.

రసప్రకరణము సమాప్తము.



# సంగీతప్రకరణము

సంగీతమును గూర్చి తెలుపు విషయంబులుగలది సంగీత ప్రకరణంబనంబడును.

"శ్లో. శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తిగానరసంఫణీ". అను ననుభవమును బట్టి నాయికానాయకనిష్ఠ విభావాను భావాదులను కావ్యనాట్యాదులందు సామాజికులకు రసత్వంబున బరిణమింప జేయుటలో సంగీతము ముఖ్యసహాయ మగుచున్నది.

పురాణము జదువుటకు గూడ రాగ మావశ్యకమనుటకు నుపష్టంభకముగ హరివంశము శేషధర్మములో.

గీ. పదపదంబునువిభజించి తుదయు మొదలు
నేరుపడశబ్ద భావంబు లెల్లగిరాగ
సమితినైనను శ్రీరాగ సరణినైన
సభనుతింప బురాణముల్ చదువవలయు.

అనియున్నది.

ఈసంగీతము ౨ విధములు.

౧ మార్గము = అనగా నీశ్వరప్రణీతమై భరతఋషిచే బ్రకటింప బడినది.

౨ దేశ్యము = అనగా నాయాదేశములయందు వాడుక గలిగి మనోహరముగానుండునది.

ఇందుకు శ్రుతిలక్షణము.

శ్రుతి = అనగా శ్రవణగోచరమగు హ్రస్వాక్షరధ్వని.

అనురణనము = అనగా శ్రుతి వెనుకదాని ననుసరించి వినబడుచుండు నాదము.

స్వరము = అనగా ఆధ్వని, స్వతః శ్రుతికి రంజనము చేయుచున్నది గాబట్టి స్వరమనిపేరు - ఇందుకు శ్లో. స్వతోరంజయతి శ్రోతృచిత్తం సస్వర ఉచ్యతే. అనియున్నది.

ఈస్వరములు షడ్జము, ఋషభము, గాంధారము, మధ్యమము, పంచమము, దైవతము, నిషాదము అని సప్త స్వరములు.

శ్రుతుల వలన శుద్ధస్వరములు, శుద్ధస్వరగత శ్రుతుల మేళనమువలన వికృతస్వరములు ఈయన్నింటి మేళనము వలన పూర్ణరాగములుగా నుండు జనకరాగములు పుట్టుచున్నవి.

ఈజనక రాగములలో గొన్ని స్వరములు వర్జ్యములై షాడవషాడవ భేదంబులు గలిగి వానిచేత జన్యరాగంబులు పుట్టుచున్నవి.

స్వరోత్పత్తికి ప్రధానశ్రుతులు ౫ వీనివలన గలుగునవి ౨౨ శ్రుతులు ఈ ౨౨ శ్రుతులలో గొన్నికొన్ని చేరి శుద్ధ స్వరములయిన వనియు, స్వరములకు జేరిన శ్రుతులసంఖ్య.

స = అనగా షడ్జస్వరమునకు ౪ శ్రుతులు.
రి = అనగా ఋషభమునకు ౩
గ = అనగా గాంధారమునకు ౨
మ = అనగా మధ్యమమునకు ౪
ప = అనగా పంచమమునకు ౪
ద = అనగా ధైవతమునకు ౩
ని = అనగా నిషాదమునకు ౨

౨౨

ఈప్రకారము శ్రుతులుచేరి స్వరములయినవని శాస్త్రములలో జెప్పబడియున్నది.

ఈశ్రుతిభేదములు ముఖతః పాడిచూపుటకును, వీణాది యంత్రములచేత జూపించుటకును, వలనులేక యొకరికొకరికి జెప్పుకొన వలసిన మాటలుగానున్నయవిగాన, శ్రుతుల పేరులు వ్రాయబడలేదు.

## త్రిస్థానలక్షణము

మంద్రము=దీనికిస్థానము హృదయము.
మధ్యమము=దీనికిస్థానము కంఠము.
తారకము=దీనికిస్థానము మూర్ధము.

మఱియు నిమ్నాదుస్థానముల సామీప్యముననుసరించు స్థానములుగా పాడునవి, యనుస్థానములనంబడును.

గ్రామభేదములు అనగా పాడుటకు శ్రుతిగూర్చుటలు.

౧ షడ్జగ్రామము = అనగా మంచర షడ్జస్వరస్థానము నాధారశ్రుతిగా నేర్పఱచుకొని శ్రుతిజేసికొనుట.

౨ మధ్యమగ్రామము = అనగా ఆషడ్జము మొదలు మధ్యమస్వరపర్యంతము ఆరోహణముగాపోగా ఆ మధ్యమ స్వరమునే ఆధారషడ్జముగాజేసికొని శ్రుతిగా గూర్చుట.

3 గాంధర్వగ్రామము = అనగా పైసప్తాసీనరీతిగా షడ్జము మొదలు ఒకస్థాయి ఆరోహణముగా పోయి పై స్థాయిలో గాంధర్వస్వరము నాధారషడ్జముగా శ్రుతిగూర్చు కొనుట. ఇది మిగుల హెచ్చుగా పాడవలెనది గనుక మనుష్యు లకు సాధ్యము కాదనియు దేవతలు పాడవలెన నియు శాస్త్ర ములలో సంకేతముచేసినారు.

పై వాట్ల లక్షణములను తెలుపు లక్ష్యములు ౨

౧ దైవీవీణ=అనగా మనుష్యగాత్రము.

౨ మానుషీవీణ=అనగా మనుష్యకృతమైనవీణ. దైవీ వీణయగు మనుష్యగాత్రమునందు స్వరాదులుపలికించుటకు మానుషీవీణయగు నచ్యుతరాయవీణయందు, లక్ష్యమును కనుపఱచుచున్నాము.

**వీణావిషయము**

భూలోకములో వాడుకగానుండు దప్రవీణకు ౧౨ ఇండ్లుగలవు. ఈయిండ్లలో శుద్ధస్వరము లేదు. తారకషడ్జము ౧ కూడాచేరి ౮ ఆయెను మిశ్రస్వరములు ౪ కూడాచేరి ౧౨ స్వరములాయెను. తక్కినమిశ్రస్వరములు ౪ ఉన్నవి. అవి యీ ౧౨ ఇండ్లలోనే పలుకుచుండుటచేత ఘాటికి నిండ్లు వేఱుగనుండ నక్కఱలేదు.

స్వరములు ౩ విధములు, శుద్ధములు, మిశ్రములు

౧ షడ్జము.

౨ శుద్ధఋషభము దీనిలో వికృతిచతుశ్శ్రుతి ఋషభము షట్శ్రుతిఋషభము. ఇందులో ౨ వికృతులు.

3 శుద్ధగాంధారము=దీనిలో వికృతి సాధారణగాంధారము, అంతరగాంధారము, ఇందులో ౨ వికృతులు.

౪ శుద్ధమధ్యమము=దీనిలో వికృతి ప్రతిమధ్యమము-౧

౫ శుద్ధపంచమము=వికృతిలేదు.

౬ శుద్ధధైవతము = దీనిలోవికృతిచతుశ్శ్రుతిధైవతము, షట్శ్రుతిధైవతము. ఇందులో వికృతులు ౨

౭ శుద్ధనిషాదము = దీనిలో వికృతి కైశికీనిషాదము కాకలీనిషాదము. ఇందులో వికృతులు ౨

౮ తారకషడ్జము.

ఈశ్రుతులు ౧౬ కి పద్యము——

క॥ వరశుద్ధశ్రుతులెనిమిది
ధరమిశ్రశ్రుతులునాల్గు దగునీరాగై
మరిమిశ్రము రెట్టింపగ
దిరముగబదియారుశ్రుతులు తెలగుననొప్పన్.

వీణయిండ్లు ౧౨ వీట్లలోనే ౧౬ స్వరము లెచ్చు టెచ్చుట బలుకునవి వ్రాయుచున్నాను.

క. చరిలోశుగషరిలోసగ
మరిషధలోకైని యుంచి మాటికి పిదపన్
వరుసగచధలోశునియా
ధరలోనిట వ్రాసిచూడ దగునీక్రమమున్.

మందరస్థాయి యితరతంత్రుల మెట్లమీదుగా బట్టిచూపుచున్నారు. ఈయచ్యుతరాయవీణ మేళగించు క్రమము. వీణ క్రింది మేరువునుంచి పై మేరువువఱకు త్రాడు కొలతయెత్తి యీ త్రాటిలోనిన్ని యిన్ని భాగములలో ౨౪ మెట్లుంచితే ఒక సారిణి తంత్రిలోనే ౩ స్థాయీలు పలుకుచున్నవని వ్రాయబడియున్నది. అది అంత ప్రమాణముగా లేనందునను, అనుభవజ్ఞులు శుద్ధవికృతుల స్వరజ్ఞానముమీద మేళగించి సరిచేయవలనదిగా నున్నందున వీణమేళగించుకొట్ల యిందులో వ్రాయలేదు.

## మేళకర్తరాగముల ప్రస్తారము

### శుద్ధమధ్యమ మేళకర్తలు

| శు-రి | శు-గాం | శు-మ | శు-పం | శు-దై | శు-ని |
|---|---|---|---|---|---|
| శు-రి | సా-గాం | | | శు-దై | కై-ని |
| శు-రి | అం-గాం | | | శు-దై | కా-ని |
| చ-రి | సా-గా | | | చ-దై | కై-ని |
| చ-రి | అం-గా | | | చ-దై | కా-ని |
| ష-రి | అం-గా | | | ష-దై | కా-ని |

ఇవి శుద్ధమధ్యమ చక్రాలు ౬. చక్రము ౧ కి ౬ చొప్పున ౩౬ భేదములు పుట్టుచున్నవి. ఇదేప్రకారముగ ప్రతిమధ్యమమును మాత్రము శుద్ధమధ్యమస్థానములోనుంచి యిదేరీతిగ ప్రస్తరించితే ౩౬ ప్రతిమధ్యమ మేళకర్తలు పుట్టుచున్నవి. ఈ రెండుచేరి ౭౨ మేళకర్తలు, ఇవె సంపూర్ణజనక రాగములు.

వీట్లకు ప్రత్యేక ప్రత్యేకముగా సంఖ్య దెలియజేయు వేర్లు వాట్లశుద్ధవికృతస్వరములు వివరించుచున్నాను.

౭౨ మేళములయొక్క లెక్క దెలియుటకు మేళకర్త పేరు మొదలనుండు రెండక్షరములను కాదినవ, టాదినవ, పాదిపంచ, యాద్యష్టౌ, అను లెక్కచేత జూడవలెను.

౧ కనకాంగి = అనగా కాదినవ, యనుసంఖ్యవలన కకారము మొదలు ఝకారమువఱకు ౯ సంఖ్యయగుచున్నది కాబట్టి కాదినవలో, క, అనునక్షరము మొదటిది అట్టికకారము నాది యందు గలదిగాన ౧ టవ మేళమని సంజ్ఞ - రెండవ యక్షరము లెక్కించగూడదనుటకు నిషేధార్థమును దెలుపు నకారమును రెండవయక్షరముగా జేర్చినందున రెండవయక్షరమగు నకారమును లెక్కించ గూడదు.

దీనికిస్వరము.

శు । రి శు । గాం శు । మ॥ పం । శుద్దై శు । ని.—— అన్నియు శుద్ధస్వరములే.

౨ రత్నాంగి = అనగా యాద్యష్టౌ, అను లెక్కలో యకారమునకు రెండవవర్ణము రకారము గనుక అట్టిరేఫనాది గాగలమేళమైనందున రెండవమేళమనిపేరు.

ఇచ్చటనున్న పూర్వమువలెనే తకారమునకంటే పరముగా నిషేధార్థమును దెలుపు నకారమును జేర్చియున్నందున రెండవవర్ణమునకు లెక్కలేదు.

**సభారంజని—3**

దీనికిస్వరము.

శు-రి। శు-గాం। శు-మ। పం। శు-దై। కై-ని। నిషాదములో విక్రృతి స్వరమయిన కైశికీ నిషాదముపుట్టినది తక్కిన వన్ని శుద్ధములే.

౩ గానమూర్తి = కాదినవలో ౩ వర్ణమయిన గకారము మొదలుగ గలిగినందున ౩ మేళమని సంజ్ఞ ౨ వర్ణము నకారమయినందున లెక్కబనిలేదు.

దీనికిస్వరము.

శు-రి। శు-గాం। శు-మ। పం। శు-దై। కా-ని। కాకలీనిషాదము విక్రృతము గలిగినది.

౪ వనస్పతి = యాద్యష్టౌ అనులెక్కలో ౪ వర్ణమగు వకారమునాదిగా గలది గాన నాలుగోమేళమనిసంజ్ఞ - రెండవ వర్ణము నకారమయినందున లెక్కబనిలేదు.

దీనికిస్వరము.

శు-రి। శు-గాం। శు-మ। పం। చ-దై। కై-ని.

౫ మానవతి = పాదిపంచ అనుసంఖ్యలో ౫ దగు మకారము నాదియందుగలది గాన ఐదోమేళము. నకారము లెక్కలేదు. ఇంతకుమీద ఈరీతిగ నకారమూహ్యంబు.

దీనికిస్వరము.

శు-రి। శు-గాం। శు-మ। పం। చ-దై। కా-ని।

౬ తానరూపి = టాదినవలో ౬ వర్ణమయిన తకార మాదియందున్నందున ౬ మేళము.

స్వరము.

శు-రి। శు-గాం। శు-మ। పం। ష-ధై। కా-ని। వీనిలో అన్ని శుద్ధములును, షట్ఛ్రుతిధైవతమును కాకలీనిషాదమును వికృతి పుట్టినవి.

౭ సేనావతి = యాద్యష్టౌ అనులెక్కలో ౭ వర్ణమగు సకారమాది గాగలదిగాన ౭ మేళము.

స్వరము.

శు-రి। సా-గా। శు-మ। పం। శు-ధై। శు-ని। గాంధారములో వికృతిగలిగినది.

౮ హనుమత్తోడి = యాద్యష్టౌ అను సంఖ్యలో ౮ వర్ణమగు హకారమాదిగాగలదిగాన ౮ మేళము.

స్వరము.

శు-రి। సా-గాం। శు-మ। పం। శు-ధై। కై-ని। గాంధారములోను నిషాదములోను వికృతి గలిగినది.

౯ ధేనుక మేళము = టాదినవలో ౯ వర్ణమగు ధకారము ఆదియందు గలదిగాన ౯ మేళము.

శు-రి। సా-గాం। శు-మ। పం। శు-ధై। కా-ని। వీనిలో నిషాదము వికృతి.

౧౦ నాటకప్రియ = ఇదిమొదలు వామాంక విశేషముగా లెక్క జూడవలయును. అనగా ౨ వర్ణముయొక్క సంఖ్యను ముందు వేసికొని మొదటి అక్షరముయొక్క సంఖ్యను దాని వెంబడిగా వేయవలయును. మొదటనుండు నిషేధార్థమును దెలుపు నకారమునకు సున్న వేయవలయును, రెండవవర్ణమయిన టకారముయొక్క ౧ టవ అంకమును ముందుగా వేసికొని నకారముయొక్క సున్నను దాని వెంబడిగా వేసి చూచితే ౧౦ మేళమని సంజ్ఞ.

దీనిస్వరము.

శు-రి। సా-గాం। శు-మ। పం। చ-ధై। కై-ని।

౧౧ కోకిలప్రియ = కాదినవలో మొదటివర్ణములగు కకారముల రెండింటికిని ఒక్కొకసంఖ్యను వెంబడి వెంబడిగా వేసినందున ౧౧ మేళమగుచున్నది.

శు-రి। సా-గా। శు-మ। పం। చ-ధై। కా-ని।

౧౨ రూపావతి = ప౧। ర౨। కూడా వేసినందున ౧౨ మేళమగుచున్నది, శు-రి। సా-గా। శు-మ। పం। ష-ధై। కా-ని।

౧౩ గాయకప్రియ = య౧ గ౩ కూడా వేసినందున ౧౩ మేళము. శు-రి। అం-గా। శు-మ। పం। శు-ధై। శు-ని।

౧౪ వకుళాభరణము = క౧ వ౪ రెంటినికూడా వేసినందున ౧౪ మేళము శు-రి। అం-గా। శు-మ। పం। శు-ధై। కై-ని।

౧౫ మాయామాళవగౌళ = య ౧ మ ౫ చేరి ౧౫ మేళము. శు-రి। అం-గాం। శు-మ। పం। శు-ధై। కా-ని।

౧౬ చక్రవాకము = క ౧ చ ౬ చేరి ౧౬ మేళము. శు-రి। అం-గా। శు-మ। పం। చ-ధై। కై-ని।

౧౭ సూర్యకాంత = య ౧ స ౭ వేసితే ౧౭ మేళము. శు-రి। అం-గా। శు-మ। పం। చ-ధై-కాని।

౧౮ హాటకాంబరి = ట ౧ హ ౮ కూడా ౧౮ మేళము, శు-రి। అం-గా। శు-మ। పం। ష-ధై। కా-ని।

౧౯ ఝంకారధ్వని = క ౧ ఝ ౯ కూడా ౧౯ మేళము, చ-రి। సా-గా। శు-మ। పం। శు-ధై। శు-ని।

౨౦ నఠభైరవి = ఠ ౨ నకారమునకు సంఖ్య లేనందున సున్న పెట్టవలయును కూడా చేరి ౨౦ మేళము. చ-రి। సా-గా। శు-మ। పం। శు-ధై। కై-ని।

౨౧ కీరవాణి = ర ౨ క ౧ కూడ ౨౧ మేళము, చ-రి। సా-గా। శు-మ। పం। శు-ధై। కా-ని।

౨౨ ఖరహరప్రియ = ర ౨ ఖ ౨ కూడ ౨౨ మే. చ-రి। సా-గా। శు-మ। పం। చ-ధై। కై-ని।

౨౩ గౌరీమనోహరి = ర ౨ గ ౩ కూడా ౨౩ మే. చ-రి। సా-గా। శు-మ। పం। చ-ధై। కా-ని।

౨౪ వరుణప్రియ = ర ౨ వ ౪ కూడా ౨౪ మే। చ-రి। సా-గా।శు-మ-పం। ష-ధై। కా-ని।

౨౫ మారరంజని = ర ౨ మ ౫ కూడ ౨౫ మే॥ చ-రి। అం-గా। శు-మ। పం। శు-ధై। శు-ని।

౨౬ చారుకేశి = ర ౨ చ ౬ కూడ ౨౬ మే॥ చ-రి। అం-గా। శు-మ। పం। శు-ధై। కై-ని।

౨౭ సరసాంగి = ర ౨ స ౭ కూడ ౨౭ మే॥ చ-రి। అం-గా। శు-మ। పం। శు-ధై। కా-ని।

౨౮ హరికాంభోజి = ర ౨ హ ౮ కూడ ౨౮ మే॥ చ-రి। అం-గా। శు। మ। పం। చ-ధై। కై-ని।

౨౯ ధీరశంకరాభరణము = ర ౨ ధ ౯ కూడ ౨౯ మే॥ చ-రి। అం-గా। శు-మ। పం। చ-ధై। కా-ని।

౩౦ నగానందిని = గ ౩ నిషేధార్థమును దెలుపునకార మునకు సున్నయుంచవలెను గాన ౩౦ మే॥ చ-రి। అం-గా। శు-మ। పం। ష-ధై। కా-ని।

౩౧ యాగప్రియ = గ ౩ య ౧ కూడా ౩౧ మే॥ ష-రి। అం-గా। శు-మ। పం। శు-ధై। శు-ని।

౩౨ రాగవర్ధని = గ ౩ ర ౨ కూడా ౩౨ మే॥ ష-రి। అం-గా। శు-మ। పం। శు-ధై। కై-ని।

౩౩ గాంగేయభూషణి = గ ౩ గ ౩ కూడా ౩౩ మే॥ ష-రి। అం-గా। శు-మ। పం। శు। ధై। కా-ని।

౩౪ వాగధీశ్వరి = గ ౩ వ ౪ కూడ ౩౪ మే॥ ష-రి। అం-గా। శు-మ। పం। చ-ధై। కై-ని।

౩౫ శూలిని=ల ౩ శ ౫ కూడ ౩౫ మే॥ షు-రి॥ అం-గా॥ శు-మ॥ పం॥ చ-పై॥ కా-ని॥

౩౬ చలనాట=ల ౩ చ ౬ కూడ ౩౬ మే॥ షు-రి, అం-గా, షు-పై, కా-ని, శు మ, పం.

ఈముప్పదియారు మేళకర్త్రరాగములు శుద్ధమధ్యమమును మధ్యనుంచి ప్రస్తరించితే పైజెప్పిన ప్రకారము ౧౨ యింన్లలో బల్కబడు శుద్ధవికృతస్వరములనుబట్టి యారు చక్రము లేర్పడుచున్నవి గనుక ఆఆరారులు ముప్పదియారు భేదంబులు గలిగె.

ఇక నిదే ప్రకారము ప్రతిమధ్యమమును మధ్యనుంచి యిదేరీతిగ శుద్ధవికృతులు ప్రస్తరించితే యిదేరీతిగ ౩౬ భేదంబులు గలుగుచున్నవి గనుక కడమ ముప్పదియారింటికి శుద్ధవికృతస్వరములు వ్రాయడములేదు.

౩౭ మేళము మొదలుకొని ౭౨ మేళమువఱకు పేరులు మాత్రము సంఖ్యకు సరిగానున్నవి గనుక పేర్లకులెక్క విమర్శ మాత్రము వ్రాయబడును.

౩౭ సాలగము=ల ౩ స ౭ కూడా ౩౭ మేళము.

దీనికిస్వరము

శు-రి, శు-గాం, ప్రతిమధ్యమము, పం, శు-పై, శు-ని,

౩౮ జలార్ణవము=ల ౩ జ ౮ కూడా ౩౮ మేళము.

౩౯ ఝాలవరాళి=ల ౩ ఝ ౯ కూడా ౩౯ మే॥

౪౦ నవనీతము=వ ౪ నకారమునకు లెక్కగా సున్న పెట్టవలయును కూడ ౪౦ మే॥

౪౧ పావనీమేళము=వ ౪ పా ౧ కూడ ౪౧ మే॥
౪౨ రఘుప్రియ=ఘ ౪ ర ౨ కూడ ౪౨ మే॥
౪౩ గవాంభోధి=వ ౪ గ ౩ కూడ ౪౩ మే॥
౪౪ భవప్రియ=వ ౪ భ ౪ కూడా ౪౪ మే॥
౪౫ శుభాపంతువరాళి=భ ౪ శ ౫ కూడ ౪౫ మే॥
౪౬ షడ్విధమార్గణి=డ ౪ ష ౬ కూడ ౪౬ మే॥
౪౭ సువర్ణాంగి=వ ౪ స ౭ కూడ ౪౭ మే॥
౪౮ దివ్యమణి=వ ౪ ద ౮ కూడ ౪౮ మే॥
౪౯ ధవళాంబరి=వ ౪ ధ ౯ కూడ ౪౯ మే॥
౫౦ నామనారాయణి = మ ౫ నకారమునకునున్న కూడ ౫౦ మే॥
౫౧ కామవర్ధని=మ ౫ క ౧ కూడ ౫౧ మే॥
౫౨ రామప్రియ=మ ౫ ర ౨ కూడ ౫౨ మే॥
౫౩ గమనశ్రమ=మ ౫ గ ౩ కూడ ౫౩ మే॥
౫౪ విశ్వంభరి=శ ౫ వ ౪ కూడ ౫౪ మే॥
౫౫ శ్యామలాంగి=మ ౫ శ ౫ కూడ ౫౫ మే॥
౫౬ షణ్ముఖప్రియ=ణ ౫ ష ౬ కూడా ౫౬ మే॥
౫౭ సింహేంద్రమధ్యమ = మ౫ స ౭ కూడా ౫౭ మే॥
౫౮ హేమవంతిని = మ ౫ హ ౮ కూడా ౫౮ మే॥
౫౯ ధర్మమతి = మ ౫ ధ ౯ కూడా ౫౯ మే॥
౬౦ నీతిమతి = త ౬ న, ౦, కూడ ౬౦ మే॥
౬౧ కాంతామణి = త ౬ క ౧ కూడా ౬౧ మే॥
౬౨ రిషభప్రియ = ష ౬ ర ౨ కూడా ౬౨ మే॥
౬౩ లతాంగి = త ౬ ల ౩ కూడా ౬౩ మే॥

౬౪ వాచస్పతి = చ ౬ వ ౪ కూడ ౬౪ మే॥
౬౫ మేచకళ్యాణి = చ ౬ మ ౫ కూడ ౬౫ మే॥
౬౬ చిత్రాంబరి = త ౬ చ ౬ కూడ ౬౬ మే॥
౬౭ సుచారిత్రి = చ ౬ స ౭ కూడ ౬౭ మే॥
౬౮ జ్యోతిస్స్వరూపిణి = త ౬ జ ౮ కూడ ౬౮ మే॥
౬౯ ధాతువర్ధని = త ౬ ధ ౯ కూడ ౬౯ మే॥
౭౦ నాసికాభూషణి = స ౭ న, ౦, కూడ ౭౦ మే॥
౭౧ కోసల = స ౭ క ౧ కూడ ౭౧ మే॥
౭౨ రసకప్రియ = స ౭ ర ౨ కూడా ౭౨ మే॥

ఇవి డెబ్బదిరెండు మేళకర్తల పేర్లు.

## జన్యరాగములు

మేళకర్తలు = అనగా జనకరాగములు ఇవి పైనవ్రాసిన విమర్శవలన శుద్ధస్వరములు వికృతి స్వరములు చేర్చి ప్రస్తరించునవి గాన నివి సంపూర్ణ సప్తస్వరములతో జేరినవి. ఆయొక్కొక్క జనకరాగమునకు జన్యరాగములనునవి. ఒకస్వరము ఆరోహణములోగాని, అవరోహణములోగాని, కొన్నింటికి రెంటిలోగాని, ఒకస్వరము వర్జ్యముగా నుండుట షాడవమనియు, అదేరీతిన రెండుస్వరములు వర్జ్యములైనయెడల ఔడవమనియు జెప్పఁబడుచున్నవి.—

మేళకర్త = అనగా జనకరాగము ౧ కి సప్తస్వరములు ఆరోహణావరోహణములయందు సంపూర్ణముగా వ్రాసి దాని క్రింద సదరుభేదముల ప్రకారముగ స్వరవర్జ్యములుజేసి ప్రస్తరించితే యేర్పడు భేదములు.

## మూర్ఛనా ప్రస్తారచక్రము, అనగా జన్యరాగ ప్రస్తారము

| | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | రి | గ | మ | ప | ధ | ని | స | ౧ | స | ని | ధ | ప | మ | గ | రి | స |
| స | రి | గ | మ | ప | ధ | ౦ | స | ౨ | స | ౦ | ధ | ప | మ | గ | రి | స |
| స | రి | గ | మ | ప | ౦ | ని | స | ౩ | స | ని | ౦ | ప | మ | గ | రి | స |
| స | రి | గ | మ | ౦ | ధ | ని | స | ౪ | స | ని | ధ | ౦ | మ | గ | రి | స |
| స | రి | గ | ౦ | ప | ధ | ని | స | ౫ | స | ని | ధ | ప | ౦ | గ | రి | స |
| స | రి | ౦ | మ | ప | ధ | ని | స | ౬ | స | ని | ధ | ప | మ | ౦ | రి | స |
| స | ౦ | గ | మ | ప | ధ | ని | స | ౭ | స | ని | ధ | ప | మ | గ | ౦ | స |
| స | రి | గ | మ | ప | ౦ | ౦ | స | ౮ | స | ౦ | ౦ | ప | మ | గ | రి | స |
| స | రి | గ | మ | ౦ | ధ | ౦ | స | ౯ | స | ౦ | ధ | ౦ | మ | గ | రి | స |
| స | రి | గ | మ | ౦ | ౦ | ని | స | ౧౦ | స | ని | ౦ | ౦ | మ | గ | రి | స |
| స | రి | గ | ౦ | ప | ధ | ౦ | స | ౧౧ | స | ౦ | ధ | ప | ౦ | గ | రి | స |
| స | రి | గ | ౦ | ప | ౦ | ని | స | ౧౨ | స | ని | ౦ | ప | ౦ | గ | రి | స |
| స | రి | గ | ౦ | ౦ | ధ | ని | స | ౧౩ | స | ని | ధ | ౦ | ౦ | గ | రి | స |
| స | రి | ౦ | మ | ప | ధ | ౦ | స | ౧౪ | స | ౦ | ధ | ప | మ | ౦ | రి | స |
| స | రి | ౦ | మ | ప | ౦ | ని | స | ౧౫ | స | ని | ౦ | ప | మ | ౦ | రి | స |
| స | రి | ౦ | మ | ౦ | ధ | ని | స | ౧౬ | స | ని | ధ | ౦ | మ | ౦ | రి | స |
| స | రి | ౦ | ౦ | ప | ధ | ని | స | ౧౭ | స | ని | ధ | ప | ౦ | ౦ | రి | స |
| స | ౦ | గ | మ | ప | ధ | ౦ | స | ౧౮ | స | ౦ | ధ | ప | మ | గ | ౦ | స |
| స | ౦ | గ | మ | ప | ౦ | ని | స | ౧౯ | స | ని | ౦ | ప | మ | గ | ౦ | స |
| స | ౦ | గ | మ | ౦ | ధ | ని | స | ౨౦ | స | ని | ధ | ౦ | మ | గ | ౦ | స |
| స | ౦ | గ | ౦ | ప | ధ | ని | స | ౨౧ | స | ని | ధ | ప | ౦ | గ | ౦ | స |
| స | ౦ | ౦ | మ | ప | ధ | ని | స | ౨౨ | స | ని | ధ | ప | మ | ౦ | ౦ | స |

ఈప్రస్తారమువల్ల పుట్టిన జన్యరాగములు.

సంపూర్ణషాడవభేదములు ౬ = అనగా ఆరోహణములో సంపూర్ణముగా నుండి యవరోహణములో నొకస్వరము వర్జ్యముచేయు భేదములు:—

౨ సంపూర్ణఔడవభేదములు ౧౫ = అనగా ఆరోహణములో సంపూర్ణముగానుండి అవరోహణములో రెండుస్వరములు వర్జ్యముచేసితే, యగు భేదములు.

౩ షాడవసంపూర్ణభేదములు ౬ = అనగా ఆరోహణములో నొక స్వరము వర్జ్యమై, అవరోహణములో సంపూర్ణములుగా నుండునవి.

౪ ఔడవసంపూర్ణభేదములు ౧౫ = అనగా ఆరోహణములో ౨ స్వరములు వర్జ్యములై అవరోహణములో సంపూర్ణములుగా నుండునవి.

౫ షాడవషాడవభేదములు ౩౬ = అనగా ఆరోహణములోను, అవరోహణములోను నొకస్వరము వర్జ్యముగా నుండునవి.

౬ షాడవఔడవభేదములు ౯౦ = అనగా ఆరోహణములో నొకస్వరము అవరోహణములో ౨ స్వరములు వర్జ్యములుగా గలవి.

౭. ఔడవషాడవభేదములు ౯౦ = అనగా ఆరోహణములో ౨ స్వరములు అవరోహణములో నొక్కస్వరము వర్జ్యముగా నుండునవి.

౮ ఔడవఔడవభేదములు ౨౨౫ = అనగా ఆరోహణమునందు ౨ అవరోహణమునందు ౨ వర్జ్యములు గాగలవి.

అంతుమొత్తము మేళకర్తయైన జనకరాగము ౧-కి జన్య భేదములు ४८४ ఈక్రమంబున ౭౨ మేళంబుల కన్నింటికిని ३४८४८ జన్యరాగంబులు పుట్టె వీనికి మూర్ఛనాప్రస్తార మని పేరు.

అయితే పై మేళకర్తలలో బుట్టినవి కొన్ని కొన్ని జన్యరాగములు మాత్రము వాడుకలోనున్నవి.

## అంగములు

ఈరాగములకు రాగాంగ, ఉపాంగ, క్రియాంగ, దేశాంగములని ४ భేదములుగలవు—ఈదేశాంగమునే భాషాంగమందురు.

౧ రాగాంగము = అనగా సంపూర్ణములయిన మేళకర్త రాగములు.

౨ ఉపాంగము = అనగా పై మేళకర్తల వలన ఔడవ షాడవాది వర్జ్యములచే బుట్టినవి.

3 క్రియాంగము = అనగా రాగస్వరములను వక్రము చేయగా బుట్టునవి. ఇవి హిందూస్థానదేశములో మిగుల వాడుకగా నున్నవి. ఇక్కడను స్వల్పముగా వాడుకగలదు.

४ దేశాంగము = అనగా రెండేసిరాగములను గలుపుట వలన బుట్టునవి.

ఈరాగములకు న్యాసాంశగ్రహస్వరములు గలవు వీట్ల వలన రాగస్వరూపము చక్కగా నేర్పడుచున్నది. ఏట్లన—

## న్యాసాంశగ్రహములు

౧ న్యాసము = అనగా నొక్కొక్కరాగమునకు ఆల

పించునపుడు సంగతి విన్యాసముయొక్క కొనన ఆస్వరము మీఁదనిలుపుట.

౨. అంశస్వరము = అనగా ఆయారాగములో సంగతి వేసి ఆలపించు నపుడు విశేషముగా ఆస్వరమునే పూరించుచుండుట. దీనికి రాజస్వరమను పేరుగూడఁగలదు.

3. గ్రహస్వరము = అనగా రాగము నారంభించునపుడేమి, మధ్యమధ్య సంగతి నారంభించునపుడేమి, ఆస్వరములోనే యారంభించుట.

ఇట్లు ఆయా రాగముయొక్క రూపమేర్పడుటకు న్యాసాంశగ్రహస్వరములు ఈ యీరాగములకు నివి యివి యని ప్రాచీనులు నిర్ణయంచియున్నారు.

స్వరప్రస్తారము వ్రాసి ప్రయోజనములేదు - ఎందువల్లనంటే పాడేయొకచోట స్వరమునుబట్టి యడిగితే, యిదియిన్నవ భేదమనియు దీనిక్రింద నిన్ని భేదములు పుట్టినవనియు నికనిన్ని భేదములు పుట్టబోవుచున్నవనియు, నష్టోద్దిష్టము చెప్పుటకు చమత్కారముగా నుపయోగించునదియేగాని, మఱియొకదానికి పనికిరాదు.

ఇట్లే వృత్తప్రస్తారము, తాళప్రస్తారము, మూర్ఛనాప్రస్తారము అనగా అనంతరాగములు పుట్టునవి. ఇవి తెలిసియుండుట, పాండిత్యసూచకమేగాని సభలలో నుపయోగము లేదు. గనుక విడిచి పెట్టుటయైనది.

**వాది, సంవాది, వివాది, అనువాది స్వరములు**

స్వరవిషయములో, వాది, సంవాది, వివాది, అనువాది, అనునాలుగు భేదంబులు ఉపయోగించునవి. ఎట్లనగా—

౧ వాది = అనగా ఆరోహణము - సరిగమపధనిస-రిగమ పధనిస-గమపధనిస-మపధనిస-పధనిస-ధనిస-నిస-స-

౨ సంవాది=అనగా అవరోహణము-నిధపమగరిస-ధప మగరిస-పమగరిస-మగరిస-గరిస-రిస-స-

౩ వివాది=అనగా సస్సగరిసరిగమ-రిప్పమగరిగమప-గద్ద పమ-గమపధ-మన్నిధప-మపధని-పస్సనిధపధనిస-

౪ అనువాది=అనగా సరిగ-రిగమ-గమప-మపధ-పధని-ధనిస-

ఈరను స్వరసంచారములలో ముఖ్యము లయినవి. శుద్ధవికృతిస్వరాదిగా పై జెప్పినవన్నియు మానుషివీణయగు అచ్యుతరాయవీణయందు ఉండజూచుకొనవలయును.

దశవిధగమకములు

ఈవీణలో దశవిధగమకములనియు, దశవిధప్రాణము లనియు, పేర్లుగలవు. అందులో దశవిధగమకములు వ్రాయు చున్నాను. ఎట్లనగా.

౧ కంపితము=వీణయొక్క తంతిని యెడమచేత దురముగా నాడించుట.

౨ మూర్ఛన = స్వరములను ఆరోహణావరోహణముగా వాయించుట.

౩ కాలము=కుడిచేత చౌకమధ్య మధురంబుగ మీటుట.

౪ స్వరితము = ఆరోహజంటస్వరములకు మధ్య వ్రే లుంచుట.

౫ ప్రత్యాహితము = అనగా అట్లనే అవరోహణమును బట్టుట.

౬ అనుస్వరము = పట్టీమీటి యొకస్వరముపలుకులాగున చేయుట.

౭ జారు=తంత్రినిమీటి కొన్నిస్వరములయందు జారుట.

౮ ఒఱయిక = ఎడమచేతితో తంత్రిని ౧ మెట్టుమీదనే అర్ధమీడ్చుట—పూర్ణమీడ్చుట ౪ స్వరములు పలుకు వఱకు యీడ్వవచ్చును.

౯ నొక్కు = ఎడమచేతితోనే తంత్రులమీటుచు స్వరములు పట్టుట.

౧౦ హాలు=వాస్యము, మీటుట, యీ రెండును నెడమ చేతితోనే చేయుట.

## ఏకాదశప్రాణములు

౧ శ్రుతి = అనగా శ్రుతికూర్చుట

౨ మీటు = అనగా తర్జనితో మీటుట

౩ లోమీటు = అనగా కిందికిమీటుట

౪ వెలిమీటు = అనగా ఆతర్జనినే పైకెత్తి పలుమారు మీటుట

౫ పట్టు = అనగా తర్జనితో మీటి మధ్యమవేలితో నణచుట

౬ విడుపు=అనగా అణచినదాన్ని బాగావిడిచిపెట్టుట.

౭ తడమీటు=అనగా మధ్యమవేలితో మీటుట

౮ సమమీటు = అనగామధ్యమవేలు తర్జనితోచేర్చి మీటుట

౯ కత్తెరమీటు = అనగాతర్జనీమధ్యమములతో దూరముగామీటుట

౧౦ లయమీాటు = అనగాపక్కతంతులయందు కనిష్ఠి కతోమీాటుట.

సంగీతప్రకరణము సమాప్తము

# తాళ ప్రకరణము

తాళములగూర్చి చెప్పు విషయంబు గలది తాళ ప్రకరణంబనంబడును.

భరతోపనిషత్తునుబట్టి భరతర్షి భరతసూత్రములు చేసెను. ఈపలి వారిచే నివి వివరించి వ్రాయబడినవి.

చూడామణిభరతము, మాతృగుప్తభరతము, రత్నాకర చూడామణి, తౌర్యత్రికగజాంకుశము, అర్జునభరతము, హనుమద్భరతము, నందికేశ్వరభరతము, లక్షణరాజీయభరతము, శుక్రభరతము, గురుభరతము, యాజ్ఞ్యవల్క్యభరతము, నారదభరతము, జైమినిభరతము, ఇవిమొదలగు భరతములలోనుండు తాళదశప్రాణములు వివరించుచున్నాను.

నృత్తగీతవాద్యసముదాయ రూపకమయిన తౌర్యత్రికంబను మదగజంబునకు తాళమనునది అంకుశము.

### తాళశబ్దవ్యుత్పత్తి

తల ప్రతిష్ఠాయాం అనుధాతువుమీాదఘఞ్ ప్రత్యయము వచ్చి వృద్ధివచ్చి తాళము అనుశబ్దమయ్యెను.

తాళము అనఁగా కరతలద్వయ సంయోగము వలన గలుగుధ్వని. అది యర్ధనారీశ్వరు కరతలద్వయ సంయోగము వల్ల పుట్టినది. ఇందుకు పద్యము.

క. కుడిచేతఘాతశివుఁడై
యెడమనుపలికేటిశబ్ద మీశ్వరియనగా
కుడియెడమపలుకుశబ్దము
నరయనది సశబ్దమనెడి తాళంబయ్యెన్.

అని చెప్పియున్నది.

## దశప్రాణములు

ఈతాళమునకు ౧౦। ప్రాణములుగలవు. అవి యెవ్వి యనగా ?

శ్లో॥ కాలోమార్గక్రియాంగాని గ్రహజాతికళాలయాః యతిప్రస్తారఇత్యేతే దశప్రాణాః ప్రకీర్తితాః॥ అని చెప్పబడి యున్నది.

## కాలప్రాణలక్షణము

౧ కాలము = ఆద్యంతములులేనిది. అయితే క్రింద కనుపఱచెడిపరిమితులకు ప్రమాణములుగా క్షణలవాదులు గుఱుతులగుచున్నవి.

నూఱుతామరఱేకులు దొంతరగాబెట్టి సూదితో గ్రుచ్చితే అన్నియు ఱేకులు దిగబడునంతకాలము క్షణమనం బడును.

ఆక్షణములు ౮ అయితే లవము.

ఆలవములు ౮ అయితే కాష్ఠ.

ఆకాష్ఠలు ౮ అయితే నిమిషము.
ఆనిమిషములు ౮ అయితే కళ.
ఆకళలు ౨ అయితే చతుర్భాగము.
ఈ యూలును దేవమానములు.

తక్కినయూలును భూలోకములో వాడుకగానుండునవి.

౧ అనుద్రుతము = అనగా ఆచతుర్భాగములు రెండయితే అనుద్రుతము ఇదిహ్రస్వమైన అకారోచ్చారణకాలమగుచున్నది.

౨ ద్రుతము = అనగా ఆ అనుద్రుతములు ౨ అయితే ద్రుతము ఆగును.

౩ లఘువు=అనగా ఆద్రుతములు ౨ అయితే లఘువు.
౪ గురువు=అనగా ఆలఘువులు ౨ అయితే గురువు.
౫ ప్లుతము=అనగా ఆలఘువులు ౩ అయితే ప్లుతము.
౬ కాకపాదము = అనగా ఆలఘువులు ౪ అయితే కాకపాదము అగును.

ఈ ౬ కాలప్రమాణములను దెలిసి భూలోకమునందు తాళములు వాడదగినవి.

## మార్గప్రాణలక్షణము

ఈ మార్గము ౬ విధములు

౧ అతిచిత్రతరము = అనగా ఏతాళమునకైనను అనుద్రుతాక్షరకాలమునకు సమముగా గీతమునడుచుట—దీనిం గొల్లు—త.

౨ అతిచిత్రము=అనగా ఏతాళమునకైనను తాళాక్షర

కాలమునకు రెండక్షరకాలము దీర్ఘముగా నడుచునది - దీనికి సొల్లు తక అనంబడును.

౩ చిత్రతమము=అనగా ఏతాళమునకైనను తాళాక్షర కాలమునకు ౪ అక్షరములు దీర్ఘముగా నడుచునది. దీనికి సొల్లు ధరికిట యనంబడును. ఈ నాలుగక్షరముల కాలము మాత్ర అనంబడును.

౪ చిత్రము=అనగా ఏతాళమునకైన తాళాక్షరకాల మునకు రెండుమాత్రలకాలము దీర్ఘముగా నడుచునది.

౫ వార్త్తికము=అనగా తాళాక్షరకాలమునకు౪మాత్రల కాలము నడచునది.

౬ దక్షిణము=అనగా తాళాక్షరకాలమునకు౮మాత్రల కాలము నడుచునది.

ఈ ప్రకారము ఏతాళమునకైనను, నేర్పరచియుండు నక్షర కాలములకు నొక్కొక్కక్షరమునకు నడచు ప్రకారము అక్షరము మొదలు పై అక్షరమునకు జరుగు కాలదీర్ఘములు మార్గములని చెప్పబడుచున్నవి.

ఈలక్షణము తాళగీతములయందు భరతకోవిదులు అను లోమ విలోమములుగా వాడుచున్నారు.

ఈ అక్షరమక్షరము సందున నడుచు మార్గకాలము చతురశ్రజాతిగానే నడుపవలసినట్లు అనేక భరతజ్ఞులు తీర్మానించియున్నారు. ఇందుకు తౌర్యత్రికగజాంకుశములో శ్లో॥ సర్వేషామేవతాళానాం నాస్తి నాస్తి మహీతలే। ద్విజాతి రహితోమార్గ స్సంచారాయ కదాచన॥ అనియున్నది.

అయితే దేశీయములో మార్గము త్రిశ్ర మిశ్ర ఖండా దులుగా గతిభేదము చేసి వాడుచున్నారు. గనుక అవధాన ములుచేయు పాఠకుడు అన్యజాతిమార్గముగాను పాడవచ్చును.

### క్రియా ప్రాణలక్షణము

ఇక క్రియా ప్రాణ లక్షణము వ్రాయబడుచున్నది.

క్రియలు మార్గక్రియలనియు, దేశ్యక్రియలనియు ౨ విధములు.

మార్గక్రియలు ౮
దేశ్యక్రియలు ౮
౧౬

### మార్గక్రియా వివరము

ఈమార్గక్రియలో నిశ్శబ్దక్రియలు ౪ సశబ్దక్రియలు ౪ అని ౨ విధములు.

#### నిశ్శబ్దక్రియలు

౧ ఆవాపము=అనగా చేతినిముడుచుట

౨ నిష్క్రామము = అనగా విప్పుట అనగా ఆముడిచిన చేతిని విప్పుట.

3 విక్షేపము=అనగా చేయివిప్పి వెలికి విదలించుట.

౪ ప్రవేశము=అనగా కరము క్రిందికి జొనుపుట.

#### సశబ్ద క్రియలు

౧ ధ్రువము=అనగా చిటికవేసిన శబ్దము.

౨ శమ్యా=అనగా కుడిచేతితో ఘాతవేయుట.

౩ తాళము=అనగా ఎడమచేతి ఘాతశబ్దము.

౪ సన్నిపాతము=అనగా రెండుచేతులను ఘాతించిన శబ్దము.

## దేశ్య క్రియల వివరము

౧ ధ్రువకము=అనగా ఎడమహస్తములో కుడిహస్తము చేత ఘాతవేయుట.

౨ సర్పిణీ=అనగా ఘాతవేసినయాకుడిహస్తమును పైకెత్తుట.

౩ కృష్య = అనగాఎడమనుంచి కుడిపార్శ్వమునకు రానిచ్చుట.

౪ పద్మిని= అనగా ఆహస్తమే దిగువ చూచునట్లు చాచుట.

౫ విసర్జితి = అనగా ఆహస్తమే వెలిగా చుట్టుట

౬ విక్షిప్త=అనగా ఆహస్తముయొక్కవ్రేళ్లునాలుగును ముడిచి వెనుకకు తీయుట.

౭ పతాక = అనగా ఆహస్తమే మీదికి చూచునట్లు ఎత్తుట.

౮ పతిత=అనగా ఆహస్తమే చక్కగా దిగువకువంచుట.

తాళమునకుండు అనుద్రుత, ద్రుత, లఘు, ప్లుత, కాకపాదంబులుగల తాళము లన్నింటికిని ఈ౧౬ క్రియలును వాడ వలయు ననిభరతసంకేతము.

## అంగప్రాణలక్షణము

అంగము అనగా అంకము

౧ అనుద్రుతము = వ్రాయుక్రమము ౧.

దీనికిపేర్లు

అర్ధచంద్రము, అవ్యక్తము, చారునాసికము, వ్యంజనము, అనునాసికము, విరామము.

౨ ద్రుతము = వ్రాయుక్రమము. ౦

దీనిపేరులు అనగాపర్యాయనామములు.

వలయము, బిందువు, ధృవము, అంబరము, చక్రము, అర్ధమాత్ర.

3 లఘువు = వ్రాయుక్రమము

దీనిపేరులు

సరళము, నిర్వ్యాపకము, హ్రస్వము, మాత్ర, శరము.

౪ గురువు = వ్రాయుక్రమము ౭

దీనిపేరులు.

కళ, దీర్ఘము, వక్రము, విల్లు, ద్విమాత్రము, యమళము.

౫ ప్లుతము = వ్రాయుక్రమము ౭.

దీనిపేరులు

త్ర్యంగికము, దీప్తము, త్రిమాత్ర, సోమోద్భవము, త్రివక్రము, త్రిపురము, త్రైకము.

౬ కాకపాదము= వ్రాయుక్రమము +

## దీనిపేళ్లు

శబ్దహీనము, చతుర్మాత్ర, నిశ్శబ్దము, హస్తసంజ్ఞికము, రంగప్లుతము, హంసపాదము.

అనుద్రుతమునకు ౨ అంగుళములు
ద్రుతమునకు ౪ అం॥
లఘువునకు ౮ అం॥
గురువునకు ౧౬ అం॥
ప్లుతమునకు ౨౪ అం॥
కాకపాదమునకు ౩౨ అం॥

ఈక్రమంబున నున్నతంబు తెలిసి కట్టవలసినది. ఈఅంగములకు పూర్వముచెప్పినక్రియలు నడచుట యేలాగంటే.

### అంగములువాడువిధము

కాకపాదము = ఎడమనుండు సర్పిణియు, కుడినుండు కృష్యమును ఊర్ధ్వముఖమయిన పతాకమును, దిగువనుండు పతితయును, ఈనాల్గు దేశ్యనిశ్శబ్దక్రియలచేత కాకపాదము వాడదగినది.

ప్లుతము=శమ్యయనుశబ్దక్రియయు, ఆవాప, నిష్క్రామ, ప్రవేశ, అనునీ నిశ్శబ్దక్రియలును, ఈ ౪క్రియలచే వాడవలయును.

గురువు = మార్గక్రియలలో చేరిన శమ్యయును, దేశ్యక్రియలలోని పద్మినియు, ఈ౨క్రియలచే నడుపవలయును.

లఘువు= మార్గక్రియయైన శమ్యచేత అష్టాంగుళప్రమాణముగా వాడవలయును-

ద్రుతము=మార్గక్రియనైన శమ్యయందుగల అష్టాంగుళ ప్రమాణములో అర్థభాగముత్రోసి చతురంగుళ ప్రమాణముగా వాడవలయును.

అనుద్రుతము=శమ్యయందుగల అష్టాంగుళ ప్రమాణములో నాల్గవభాగముతీసి ద్వ్యంగుళప్రమాణముగావాడవలయును.

## గ్రహప్రాణలక్షణము

ఈగ్రహములు ౪ విధములు

౧ అతీతగ్రహము=అనగా గీతము ముందునడిచితాళము వెనుక నడుచునది.

౨ అనాగతగ్రహము=అనగా తాళము ముందునడిచి గీతము వెనుక నడచునది.

3 సమగ్రహము=అనగా తాళము గీతము సమకాలముగా నడచునది.

౪ విషమగ్రహము=అనగా తాళము, గీతమునకు విషమముగా నడచుట.

దీనియర్థమును భరతవిదులు ౨ విధములుగా జెప్పుచున్నారు. ఎట్లనగా,— తాళారంభాక్షరముగాక తక్కినతాళాక్షరములు రెండుభాగములుచేసి తాళారంభమునకు ముందు గీతము నడిచితే అది అతీతము అనియు,— తాళారంభము ముందునడిచి గీతము వెనుక యెత్తుకుంటే అది అనాగతము అనియు,— తాళారంభములోనే గీతము సమముగా నారంభించునది, సమము అనియు,— నిర్ణయములేకుండ ఆవృత్తమునకు మార్పులుగలుగునెడ విషమమనియు జెప్పుచున్నారు.

రెండవయర్థము

ఈభాగము తాళము బేసియక్షరములుగలదై తేఘాతలో నొక వర్ణముపోను మిగుత అక్షరములు సరిగానుండుటచే రెండుభాగములు చేయవచ్చును. తాళాక్షరములు సరిగానుంటే ఘాతలోనొకవర్ణముపోతే తక్కినవి బేసిగానుంటవి గనుక యవి రెండుభాగములు చేయుటకు ఒక యక్షరమును సగము చేయవలసియుంటున్నది. అక్షరకాలము మొదలుకొనియే మనుష్యులు పాడతగినవని పైనచెప్పియున్నది. అట్లు అర్ధాక్షరములో గీతమారంభించి పాడ వల్ల లేదని మఱికొందఱు తాళముయొక్క యేఅక్షరకాలములోనైనసరే అక్షరము మొదలు పై అక్షరము వఱకు జరుగు మార్గకాలములో నొకమాత్ర ౪ అక్షరములు "తరికిట" అని యుంచుకొని తాళ లయయొక్క యేయక్షరములోనైనను ఒక యక్షరమునకు సరిగా మార్గకాల మాత్ర మొదటియక్షరమయిన "థ"యను నక్షరములో గీతము సరిగా నెత్తుకుంటే యది సమగ్రహమనియు,

లయాక్షరమునకు సంబంధించిన "థ" యను నక్షరము వెంబడి "రి"యనునక్షరములో గీతము ఎత్తుకుంటే, లయాక్షర మతిక్రమించి "రి"యనునక్షరములో గీతమెత్తినందున, నిదియనాగతమనియు.—

లయాక్షరమునకు ౩ వ యక్షరమయిన "కి" యనునక్షరములోగీతము ఎత్తుకుంటే, అది యసిలకాలమగుచున్నది గనుక ఇదివిషమగ్రహమనియు.—

లయాక్షరమునకు ౪ దియైన "ట" యనునక్షరములో గీతమెత్తుకుంటె, తాళముయొక్క వెనుకటియక్షరమునకు నిది

ముందగుచున్నదిగాన, గీతము అతీతమైనందున అతీతగ్రహమనియు, నిట్లు చెప్పుచున్నారు.

**జాతిప్రాణలక్షణము**

చతురశ్ర, త్రిశ్ర, మిశ్ర, ఖండ, సంకీర్ణము, లని ౫ జాతులు.

౧ బ్రాహ్మణజాతిదైన చతురశ్రజాతికి లఘుకాలము ౪ అక్షరములు.

౨ క్షత్రియజాతిదైన త్రిశ్రజాతికి లఘుకాలము ౩ అక్షరములు.

౩ వైశ్యజాతిదైన మిశ్రజాతికి లఘుకాలము ౭ అక్షరములు.

౪ శూద్రజాతియయిన ఖండజాతికి లఘుకాలము ౫ అక్షరములు.

౫ సంకీర్ణజాతికి లఘుకాలము ౯ అక్షరములు.

**ఈ జాతుల వ్యుత్పత్తిక్రమము**

చతురశ్రజాతి బ్రహ్మజాతి గావున బ్రహ్మకు ౪ ముఖము లౌటచేత దీనికి ౪ అక్షరములు లఘుకాలమాయెను.

చతురశ్రజాతియొక్క లఘు కాలమైన ౪ అక్షరములను మూడింట గుణించగా ౧౨ ఆయెను. ఆ ౧౨ ను ౪ పాళ్లు చేయగా పాలు ౧ కి - ౩ ఆయెను గనుక త్రిశ్రజాతికి లఘు కాలము ౩ అక్షరములాయెను.

ఆచతురశ్రజాతి ౪ అక్షరములును ఈత్రిశ్రజాతి

3 అక్షరములును మిశ్రముచేయగా నైన యేడక్షరములును మిశ్రజాతికి లఘుకాలమాయెను.

ఈ మిశ్రముయొక్క ౭ అక్షరములును త్రిశ్రముయొక్క 3 అక్షరములును కూడి పది ఆయెను ఆ ౧౦ ని సగముగా ఖండించగా ౫ అక్షరములాయెను గనుక యీ ౫ అక్షరములకాలము ఖండజాతికి లఘుకాలమాయెను.

అన్వయమయిన చతురశ్రజాతి ౪ అక్షరములును, ఈ త్రిశ్రమిశ్రములతో గూడి ఖండింపబడిన ఖండజాతియొక్క అయిదక్షరంబులును ఈ రెండును గూడియయిన ౯ అక్షరములు సంకీర్ణజాతికి లఘుకాలమాయెను.

నందికేశ్వరభరతములో మఱికొన్ని లఘువులు చెప్పబడియున్నవి.

| | | |
|---|---|---|
| ఎట్లనగా = మనుష్యలఘువు | ౪ | అక్షరకాలము |
| సర్వలఘువు | 3 | ,, |
| మిశ్రము అనగా దేశలఘువు | ౭ | ,, |
| ఖండము అనగా చిత్రలఘువు | ౫ | ,, |
| సంకీర్ణము అనగా దివ్యలఘువు | ౯ | ,, |
| దివ్యసంకీర్ణము అనగా సింహాలఘువు | ౬ | ,, |
| మిశ్రసంకీర్ణము అనగా వర్ణలఘువు | ౮ | ,, |
| దేశసంకీర్ణము అనగా వాద్యలఘువు | ౧౦ | ,, |
| మిశ్రదేశసంకీర్ణము అనగా కర్ణాటకలఘువు | ౧౨ | ,, |
| దేశశుద్ధసంకీర్ణము నిశ్శబ్దలఘువు | ౧౬ | ,, |

ఈ లఘువులలో కొన్ని యెగువ జెప్పినవియు, గూడ నున్నవి, చూచుకొనవలయును.

### కళాప్రాణ లక్షణము

అనుద్రుతంబు, ద్రుతంబు, ఇవి ౫ జాతులలో మిశ్రమములు గావున దత్తజ్జాతి మాత్రలు మొదలుకొని కళలు రెట్టించవలెను.

చతురశ్రజాతికి ౪ అక్షరములు లఘుకాలము. దీనిని రెట్టించితే ౮ దీనిని రెట్టించితే ౧౬ దీనిని రెట్టించితే ౩౨ దీనిని రెట్టించితే ౬౪ దీనిని రెట్టించితే ౧౨౮.

ఈరీతిగ నెన్నింటినైనను హెచ్చించవచ్చును-ఇవి కళలు.

ఇదే ప్రకారము త్రిశ్రలఘువు ౩ టిచేత లెక్కించేది. ఇట్లానే మిశ్రఖండసంకీర్ణ జాతుల లఘ్వక్షరములచేత లెక్కించేది. ఇది కళాలక్షణము.

సప్తతాళాదులకు దీనియుపయోగములేదు, సప్తతాళాదులనగా సప్తతాళములు - వీట్లకేజాతినిష్ఠమయిన పైవివరించియున్న లఘువులను వాట్లవాట్ల అక్షరసంకేతసిద్ధములుగా వాడవలసినదిగాని, కడమ అనేకతాళములకు లఘువు అనగా చతురశ్రజాతిలఘువుకు గల నాలుగు అక్షరములును పట్టిలఘ్వాదిపై అంగములుకూడా వాడవలయును.

ఇందుకు చూడామణి భరతములో శ్లో॥ సప్తానామపి తాళానా మేకైకస్యాపి షడ్విధమ్। అన్యేషామేవ తాళానాం సాజాత్యైనైవ కథ్యతే॥ అనియున్నది.

మఱియు మాతృగుప్త భరతమునందు శ్లో॥ అన్యేషామేవ తాళానాం సంఖ్యాభిస్తాళవర్ణతః। జాతిభేదపరిజ్ఞానం

జ్ఞాతవ్యం గీతకోవిదైః॥ అనియున్నది గాన వాట్లను జాతి నిర్ణయము జేయుటలో ఆయాతాళముయొక్క సమష్టి అక్షర కాలము ఇన్నియనుకొని సవరుజాతుల కళల లెక్కలు దేనికి సరిపడితే ఆయాతాళమునకు ఆయాజాతితాళమని పేరు నిర్ణయించవలయును.

ఆసంఖ్యకు ౧, ౨ అక్షరములు జాస్తిగానుండినను, ఆజాతిలో జేరినవేయని యేర్పఱచి ౧ అధికముగానుంటే, అనుద్రుతము ౨ అక్షరములు అధికముగానుంటే ద్రుతము చేరినట్టు లెంచవలయును. దీని సంకేతమిది.



ఇవి మూడువిధములు.

౧ ద్రుతలయ=అనగా పాడుటకు నెంతత్వరగా తాళము వేసికొని పాడదగునో అట్లు తాళము వేసికొని పాడుట.

౨ మధ్యలయ=అనగాఅంతకు రెట్టింపువిలంబముచేయుట.

3 విలంబితము=అనగా ఆ మధ్యలయకంటే రెట్టింపు విలంబముచేయుట.

మఱియు "గీతతాళాదీనా మేకత్ర విరామోలయః" అనియు "శ్రుతిస్థాపితాలయః" అనియు జెప్పియుండుట చేత లయ ముఖ్యము.

తాళాక్షర కాలములలో వ్యత్యస్తమైనను గ్రహప్రాణము వ్యత్యస్తమైనను అనుద్రుత లయమాత్రము తప్పకుండ వలయును.

అవియుండియు లయచెడితే ప్రాణము చెడును గావున అవలయ యనంబడును.

## యతిప్రాణలక్షణము

౧ సమయతి ౨ స్రోతోవహాయతి 3 గోపుచ్ఛయతి ౪ యవమధ్యయతి ౫ వేదికాయతి ౬ విషమయతి ౭ పిపీలికా యతిఅని ౭.

ఇవితాళముల యంగములబట్టి యేర్పడునవి ఎట్లనగా—

౧ సమయతి = అనగా ।।। సమానజాతీయములగు నంగములు గలది. ఎట్లనగా నొకతాళమునకు అంగము ఒకటి రెండు మూడు లఘువులుగా నుండునెడల ।।। ఈఅంకములు ఈలాగే యేయంగములును సమములుగా నుండుట వలన సమయతి యనంబడును.

౨ స్రోతోవహాయతి = అనగా ౦ ౦ । ౭ నదివలె పుట్టుకయందు కొంచెమును క్రమ క్రమముగా తుదవఱకు గొప్పలునునగు నంగములుగలది. ఎట్లనగా, దీనితాళాంగము యొక్క అంకములు ఇట్లు నదివలె మొదట సన్నమును పోగా పోగా గొప్పయునగు నేఅంగములైనాసరే సదరుప్రకారమున్న యెడల నిది స్రోతోవహాయతి.

3 గోపుచ్ఛయతి - అనగా ౭ । ౦ ౦ గోపుత్రోక వలె పుట్టుదలలో గొప్పయు రాగారాగా సన్నయు నగు నంగములు గలది గోపుచ్ఛయతి.

౪ యవమధ్యయతి= అనగా ౦ ౦ । ౦ ౦ ఈప్రకారము యవమధ్యమువలె తాళాంగము మొదట సన్నముగాను, నడుమ లావుగాను, కొనసన్నముగాను నుండునది యవమధ్య యతి యనియు, మృదంగయతియనియు ననంబడును.

౫ వేదికాయతి = అనగా ౧ । ౦ । ౧ ఈప్రకారము అరుగువలె తాళాంగములు సన్నములావుగాని, లావుసన్నము గాని యెన్ని యంగము లుండినను ముందు వెనుక సమాన ముగా నుండునది.

౬. పిపీలికాయతి = అనగా ౭ । ౧ । ౭ ఈప్రకా రము చీమవలె తాళాంగము ముందులావుగాను, మధ్యసన్నము గాను కొనను లావుగాను నుండు నంగములుగలది పిపీలికా యతి.

౭ విషమయతి=అనగా । ౦ ౭ ౦ ౦ । ౦ ఈప్రకా రముగపై వ్యవస్థలకు సంబంధించక తాళాంగము, పైన వ్రాసిన రీతిగ వ్యత్యస్తముగా నుండు నంగములు గలది.

## ప్రస్తారప్రాణలక్షణము

తాళప్రస్తారములోననంత భేదములు గలుగుచున్నవి. అవియన్నియు ౧౪ ప్రస్తారములలోనే యంతర్భూతములు.

ఈతాళప్రస్తారమార్గంబులు, అంగశ్రేణి, సంఖ్యాశ్రేణి, పాతాళము, మహాపాతాళము, అనులెక్కలుచెప్పుట కుపయో గించుచున్నవి.

మఱియు మేరువులు జాతిజాతినిష్ఠములుగా వేఱువేఱె యేర్పడుచున్నవి.

ఇందలి ప్రయోజనము నష్టోద్దిష్టము చెప్పుటయే తప్ప నీప్రస్తారప్రకార మేర్పడు తాళములు లోకములో వాడు కలో లేవు. ఇందుకు నిదర్శనము. ఒకభరతములో ౨౦౦౦ తాళ ములును నొకభరతములో ౧౦౮ తాళములును ఈలాగే కొన్ని

కొన్ని భరతములలో కొన్నికొన్ని తాళములును నేర్పఱచి వాడినారు.

తక్కినతాళములు ప్రాచీను లేర్పఱచక త్రోసివేసినారు గాన నీ ప్రస్తారప్రాణమును అతివిస్తరమగుటచే వివరించుటలో ప్రయోజనము లేదని వదలిపెట్టబడియె.

ఇదేరీతిగ స్వరప్రస్తారము, వృత్తప్రస్తారము, మొదలగు ప్రస్తారములకు నష్టోద్దిష్టము చెప్పుట తప్ప ఇతరప్రయోజనము లేమియు లేనట్లుగానే తాళప్రస్తారమునకును బ్రయోజనము లేదని తెలిసికొనవలయును.

## సప్తతాళంబులు

జాతిభేదలఘ్వక్షర ప్రమాణములచేత వాడదగిన సప్త తాళంబులు. శ్లో. ధ్రువోమఠో్యరూపకశ్చ ఝంపాత్రిపుట ఏవచ। అటతాళైకతాళౌచ సప్తతాళాః ప్రకీర్తితాః. అని యున్నది.—ఎట్లనిన.

౪ అక్షరములుగల చతురశ్రజాతిలో సప్తతాళములు వ్రాయుచున్నాను.

| (తాళము) | (అంగము) | (అక్షరకాలము) |
|---|---|---|
| ౧ ధ్రువతాళము— | ( । O । । ) | ౧౪ |
| ౨ మఠ్యతాళము— | ( । O । ) | ౧౦ |
| 3 రూపకతాళము | ( । O ) | ౬ |
| ౪ ఝంపాతాళము | ( । ◡ O ) | ౭ |
| ౫ త్రిపుటతాళము | ( । O O ) | ౮ |
| ౬ అటతాళము | ( । । O O ) | ౧౨ |
| ౭ ఏకతాళము | ( । ) | ౪ |

ఈ తాళములలో ౫ వదైన త్రిపుట తాళమునే ఆది తాళ మందురు.—

ఈప్రకారముగ త్రిశ్ర మిశ్ర ఖండ సంకీర్ణాది జాతులకు దృతలఘ్వక్షర ప్రమాణములచేత తాళాక్షర కాలమును నిర్ణయించుకొని వాడుకొనవలయును.

ఈప్రస్తుతతాళములకే యీనిర్ణయము తక్కినతాళములకు చతురశ్రజాతి లఘువునుబట్టియే వాడవలయును యిందుకు నిదర్శనము.

## సింహానందన తాళక్రమము

శ్లో. చంచత్పుటే ప్రతితాళే దర్పణే కోకిలప్రియే ।
అభంగచండికాయుక్తే షడేతే సింహానందనః. అనియున్నది.

దీనికి అంగము.

( 8 8 | 8̇ | 8 0 0 8 8 | 8̇ | 8̇ 8 | | + )

యీతాళముల కన్నింటికి చతురశ్రజాతిలఘువు ప్రకారమె అంగములు యేర్పడినవి గనుక ౧౨౮ అక్షరకాలములు యీతాళమునకు యేర్పడినవి.—

అయితే జైమినిమొదలగువారు ప్రస్తరప్రకారము గలుగు అనంతతాళములలో చతుష్పంచాశత్ తాళంబులు మాత్రము త్రిశ్రం మొదలుకడపనాలుగు జాతులతో వాడవచ్చునని చెప్పియున్నారు.

తాళప్రకరణము సమాప్తము.

---

# హిందూస్థానీ రాగతాళ ప్రకరణము



హిందూస్థాన దేశమునందు వాడంబడు రాగతాళముల గూర్చిచెప్పు విషయంబుగలది హిందూస్థానీ రాగ తాళ ప్రక రణాం బనంబడును.—

హిందూస్థానములో వాడుకగానుండు రాగములు తాళ ములు అచ్చట గవయ్యాలుపాడే బహానీలు అనగా భేదములు వ్రాయుచున్నాను.—

పురుషరాగములు ౬ వీట్లకు నొక్కొక్క దానికి నారేసి భార్యల చొప్పున ౩౬ స్త్రీరాగములుగలవు. ఇందువలన "ఛేరాగ్ ఛత్తీస్ రాగ్నే" అనిచెప్పెదరు. కడమరాగములు వీట్ల బిడ్డలు.

౧ మేఘ్, ౨ సిరి, ౩ దీపక్, ౪ హిండోల్, ౫ మాల్ కౌస్, ౬ భైరో, ఇవి ౬ పురుషరాగములు.

తక్కిన ౩౬ రాగ్నేలు వీట్లకుభార్యలు. తక్కినవన్నీ బిడ్డలు.

ఈ క్రిందవ్రాయు స్వరమూర్ఛనాయంత్ర ప్రస్తారము మీదగలుగుచున్నవి:—

## సప్తస్వరముల పేరులు

| కరజ్ | రిగబ్ | గధార్ | మధ్యమ | పంచమ | ధైవత్ | నిఖాద్ |
|---|---|---|---|---|---|---|
| స | రి | గ | మ | ప | ధ | ని |
| రి | గ | మ | ప | ధ | ని | ధ |
| గ | మ | ప | ధ | ని | ధ | ప |
| మ | ప | ధ | ని | ధ | ప | మ |
| ప | ధ | ని | ధ | ప | మ | గ |
| ధ | ని | ధ | ప | మ | గ | రి |
| ని | ధ | ప | మ | గ | రి | స |

ఈ స్వరములకు హెచ్చుతక్కువనుబట్టి వికృత మేర్పడుచున్నది. ఈరాగములకు శాస్త్రదేశీయములలోనేమి, యితరములయిన యచ్చటి గ్రంథములలోనేమి, గ్రామమూర్ఛనాన్యాసాంశ గ్రహస్వరభేదములచేతను, స్వరవక్రములచేతను పరస్పర రాగమేళనములచేతను రాగరాగ్నీ భేదములు గలుగుచున్నవి.

## రాగకాలములు

సూర్యోదయాదిగా నేయేజామున నేయే రాగములు పాడవలయునో వానిని వ్రాయుచున్నాను.

సూర్యోదయానంతరము ౧ టవజాముస వాడవలసిన రాగములు.

| | | |
|---|---|---|
| బిలావల్ | అలయాబిలావల్ | అలయ్యా |
| గౌడ్ బిలావల్ | సుద్ బిలావల్ | నట్ బిలావల్ |
| సువాబిలావల్ | సుగ్రై బిలావల్ | సువా |
| సుగ్రై | కోకబ్ బిలావల్ | నట్ నారాయణ |
| సురట్ బిలావల్ | బరారా | |

౨ వ జామున అనగా జాము మొదలుకొని రెండు జాముల వఱకు వాడవలసినవి.

| | | |
|---|---|---|
| బరారాతోడి | తోడి | హుసాతోడి |
| దేస్తోడి | సింధుతోడి | సావరీ |
| అసావరీ | బరహాన్స్ | బరహాన్స్ సారంగ్ |

ఈ తోడిని హిందూస్థానీలు భైరవి యందురు.

3 వ జామున అనగా రెండుజాములు మొదలుకొని 3 జాములవఱకు వాడవలసినవి.

| | | |
|---|---|---|
| సారంగ్ | సురట్ సారంగ్ | జల్ సారంగ్ |
| బణసీసారంగ్ | మద్ మావద్ | గౌడ్ సారంగ్ |
| బింద్రాబణసారంగ్ | నట్ సారంగ్ | |

౪ వ జామున అనగా మూడుజాములు మొదలుకొని సూర్యాస్తమానమువఱకు వాడవలసినవి.

| | | |
|---|---|---|
| నట్ | పరకీనట్ | మహలానట్ |
| ఛయ్యానట్ | మేఘునట్ | భీంపలాస్ |
| ధనాసరీ | పూర్బీ | పూర్బా |

| | | |
|---|---|---|
| పూర్వీ | మారో | గౌడ్ |
| గౌరీ | గౌరా | |

సూర్యాస్తమానానంతరము ౧ వ జామున అనగా సాయంకాలము మొదలుకొని జామురాత్రి వఱకు వాడవలసినవి.

| | | |
|---|---|---|
| సిరి | జయత్ సిరి | మాల్వీ |
| మాల్ సిరీ | గౌడ్ సిరీ | సిరెపంత్ |
| భాకా | మోహనకల్యాన్ | కల్యాన్ |
| శ్యామ్‌కల్యాన్ | అమీర్ కల్యాన్ | అమీర్ నట్ |
| యమన్‌కల్యాన్ | యమన్ | యమిన్నా |
| దీపక్ | దీపక్ కల్యాన్ | కామూద్ |
| జామూద్ | కామూద్ కల్యాన్ | జామూద్ కల్యాన్ |
| కోకబ్ కల్యాన్ | భూపాలీ | భూపాలికల్యాన్ |
| భూప్‌కల్యాన్ | జంఝోటి | మెఘ్‌జంఝోటి. |

౨ వ జామున అనగా జామురాత్రి మొదలుకొని ౨ జాములరాత్రి వఱకు వాడవలసినవి.

| | | |
|---|---|---|
| శంకర్ | కాలంగడా | బహారానంద్ |
| కాపీ | ముల్తానికాపీ | బేహాగ్ |
| శంకరబేహాగ్ | డూద్ బచన్ బేహాగ్ | జజూవంతి |
| ఖంమాజ్ | శుద్ ఖంమాజ్ | నాయికీ |
| నాయకా | పీలో | పట్ మంజరి |
| కానడా | జోగీకానడా | బూందీకానడా |
| జిడ్డికానడా | మియ్యాకానడా | బాకేసిరీకానడా |

| | | |
|---|---|---|
| బాగేశ్వర్ | దర్బార్ | రాష్తా |
| షహానా | ఆడానా | కేథార్ |

3 వ జామున అనగా ౨ జాముల రాత్రి మొదలుకొని 3 జాములవఱకు పాడవలసినవి.

| | | |
|---|---|---|
| పరజ్ | సోహాని | లలిత్ |
| బసంత్ | మాధో | బంగాలీ |
| మంగల్ | హిండోల్ | మాల్కౌస్ |
| కంథార్ | గంథార్ | |

౪ వ జామున అనగా 3 జాముల రాత్రి మొదలుకొని తెల్లవాఱువఱకు పాడవలసినవి.

| | | | |
|---|---|---|---|
| దేవుగాంధార్ | దేవుగిరి | కోజరి | |
| రాంకల్లి | గున్కల్లీ | పూల్కల్లి | |
| భైరో | ప్రీతంభైరో | బేబాస్ | |
| భూపాల్ | జోహార్ | వేసాక్ | దేవగిరి |

తిరుగా నుదయాదిగా నీరాగములను పైజెప్పిన ప్రకారము పాడవలయును.

మేఘావృతమయినపుడు సర్వకాలములయందును బాడందగినవి.

| | | |
|---|---|---|
| మేఘ్ | మల్లార్ | మేఘమల్లార్ |
| సురట్ | సురట్మల్లార్ | చేస్మల్లార్ |
| సాఫణ | నట్సావణ | |

## ధృపద్ లోనుండు తాళములు

| | | | |
|---|---|---|---|
| చౌతాల్ | దస్తానా | సుర్ ఫాక్తా | చతుర్ తాళ్ |
| బిరం | జోగిబిరం | జయమంగల్ | సవారి |

తాకా, టప్పా, ఠోంరీ, రవానీ వీట్లతాళములు.

౧ గత్.

౨ ఆదీగత్ = ఇదిమిశ్రగతిగా నడుచును హోలీసమయములో వాయించునది.

3 ఖరాబతి.

౪ రవానీ ఇది త్రిశ్రగతిగా నడుచును నవబత్ ఉతార్ సమయములో వాయించునది.

౫ ధమ్మాల్

ఇంకా అనేక రాగములు ననేక తాళములు నున్నవి. నేనువిన్నమట్టుకు వ్రాసితిని.

హిందూస్థానీలో పాడే బానీలు.

౧ తాన్‌సేన్ బానీ దీనినే మియ్యాబానీ అంటారు.

౨ గోబర్ హార్ బానీ = ఈబానీయును తాన్‌సేన్ బానీయును అతిచౌకముగా ధృపద్ ఉండుటయు రాగము చౌకముగా నాలపించినట్టే వీట్లధ్రుపద్ మట్టుండును.

3 గోపాల్‌నాయక్ బానీ = ఇది దక్షిణదేశమునుండి వచ్చినదని చెప్పెదరు. ఇది దక్షిణదేశపు చౌకవర్ణముల చౌకముగా నుంటున్నది.

౪ ఖండార్ బానీ = ఇది దీక్షితశ్యామా శాస్త్రులవారి కీర్తనలవలె గమకముగలిగి మధ్యమకాల శయ్యగా నుంటున్నది.

౫ డాగర్ బానీ = ఇది త్యాగరాయ కృతులకు సరిగాను మధ్యమకాలముకంటె తక్కువ కాలముగా బాడేటప్పా, ఠోంరీలు, బంగీభాయీలు నాలుగైదు సాజులు పెట్టుకొని పాడేది.

౬ సదారంగజీబానీ = ఇదే ఖ్యాల్ బానీ అని చెప్పెదరు. దీనిలో విశేషతానము తిశ్ర మిశ్ర ఖండములుగా సంగతులు వాడబడును.

## హిందూస్థాన ప్రబంధభేదములు

| | | |
|---|---|---|
| ధ్రుపద్ | తారా | టప్పా |
| ఠోమ్రీ | దాదరా | గజల్ |
| రజల్ | రేక్తా | రవానీ |
| ముబారక్ | హోలీ | ఖజరీ |
| ఖార్వా | తిల్లానా | చత్ రంగ్ |

ఇందులో తిల్లానాకు సొల్లును, చత్ రంగ్ కు సొల్లును స్వరంబును గలిగి యుండును.

హిందూస్థానకృతులలో
అస్తై = అనగా పల్లవి
అంత్రా = అనగా అనుపల్లవి
అభోగ్ = అనగా చరణము

ఇది అంతగా నాకుదెలియదు తెలిసినమట్టుకువ్రాసితిని.

హిందూస్థానీ రాగతాళప్రకరణము సమాప్తము.

# నాట్యాభినయ ప్రకరణము

నాట్యమును గురించియు నభినయంబును గురించియు జెప్పు విషయంబులుగలది నాట్యాభినయ ప్రకరణం బనం బడును.

౧ తాండవము ౨ నటనము ౩ నాట్యము ౪ లాస్యము ౫ నృత్తము ౬ నర్తనము. అని నాట్యము ౬ విధములు.

వీటిలో కొన్ని యొకకాలు పైకెత్తి ఆడునవి, కొన్ని సొల్లు నోటితో జెప్పుచు నాడునవి, కొన్ని గీతములేక తాళల యలకు అనుగుణ్యముగా దేహాంగకరణ విక్షేపములతో నాడు నవి. కొన్ని గీతతాళయుక్తముగా నభినయ విహీనముగా నాడు నవి. కొన్ని రసభావములచేత తక్కువపడినవి.

ఇవి రసయుక్తములు కానందున వీట్లకువివరణము వ్రాయ బడ లేదు.

ఇకను గీతతాళానుసారిగా నాట్యము జరుగుచు గీతోక్త విభావానుభావాదులను ముఖాదిభావముల చేత దెలుపుచు గీతోక్తపదార్థములను అసంయుత సంయుతాది హస్తములచేత జూపుచు సభ్యులబుద్ధికి రసానుభవమును గలుగజేయు నభినయ యుక్తనాట్యభేదములను వాట్లవివరణములనువ్రాయుచున్నాము.

స్త్రీకి నకారాంతములైన-నేత్రశుద్ధి-వదన స్తనావలగ్న ములు బాగాయుండవలెనని లోకప్రసిద్ధి, కొందఱు అభిన

యించు పాత్రకుగ్రామ్యోక్తిగా కంఠము, పంఠము, చంఠము బాగా యుండవలెనని చెప్పుచున్నారు.—

ఈయభినయము మూడు భేదములు. ఉత్తమము, మధ్యమము, అధమము. అని 3 విధములు.

౧ ఉత్తమము=రసాభినయము, అనగా పాత్రపాడుచునాగీతోక్తవిభావానుభావ సాత్వికసంచారి భావములను కటాక్ష భుజాక్షేపాదులచేత, లోకస్వభావానుసారిగా నిజముగా కనుపరచుచు గీతోక్తార్థమును అర్థసాదృశ్యరూపములైనఅసంయుత - సంయుతాదిహస్తములచేతను నభినయించుచు నటించుట.

ఇందుకు, శ్లో॥ కంఠేనాలంబయేద్గీతం హస్తే నార్థం ప్రదర్శయేత్ । చక్షుర్భ్యాం దర్శయే ద్భావం పాదాభ్యాం తాళమాచరేత్॥ యతోహ స్తస్తతోదృష్టి ర్యతో దృష్టిస్తతోమనః। యతోమన స్తతోభావో యతోభావ స్తతోరసః॥ అనియున్నది. దీనికిఅనుగుణ్యమయిననాట్యము. అనగా కోమలకరణాంగవిక్షేపములచేత కైశికీ వృత్తిప్రధానముగానటనముచేయుట. పాత్ర, హాసాది భావము లభినయించు తరుణములలో తానుపాడుటకు వలనులేనిసమయములో గాని లేక అలసటవచ్చు సమయము లోగాని, ఈలాటి యసందర్భ సమయములలో, వెనుక ఒక్కొక్కమనిషి ఆయాఅర్థసందర్భమునుబట్టి తదనుగుణ్యముగా నయనిష్ఠూరములచేత సంగతివేసి పాడవలెను. ఇందువలన పాత్రయొక్క ముఖభావములకు సహాయమున్ను అభినయించు నిజహస్తములకు సంచారీహస్తములకు సన్వాయము సరిపడి సభ్యులకు విమర్శగా తెలియడమును గలుగును. ఇది హిందూస్థానదేశములో విశేషముగా వాడుకగలది.

౨ మధ్యమము=అర్థాభినయము దీనికి వివరణము. వెనుక ప్రక్కనటులు మొదలగువారు పాడుటయు, ఆగీతోక్తములయినయర్థములను ప్రకరణాను సారము లయిన యర్థములను అసంయుత సంయుతాది హస్తాదులచేత పాత్రయభినయించుటయు, ఇందులకు ననుగుణ నాట్యము అలారి, జతి, మొదలయినవి.

ఇందుకు ఆడవ ఉద్ధతకరణాంగవిక్షేపాదులచేత ఆరభటీ వృత్తిప్రధానముగా నటనముచేయుట.

ఎగువ రెండును, గాంధర్వగాన యుక్తములుగా వాడుకలో నున్నవి.

3 అధమము=భాగవతసేవాది నాటకములు. ఇవి సజీవకమని నిర్జీవకమని ౨ విధములు.

౧ సజీవకము అనగా మనుష్యులు ఆడుట

౨ నిర్జీవకము అనగా బొమ్మలాడించుట

ఈనాటకములే కాళిదాసాది మహాకవులు శాకుంతలాది నాటకములుగా జెప్పినవి.

ఈనాటకలక్షణములో ననేకసంకేతము లున్నవి.

## ప్రస్తావనము

| | |
|---|---|
| ప్రస్తావనాంగములు | ౬౯ |
| శుద్ధవిష్కంభము | ౧ |
| మిశ్రవిష్కంభము | ౧ |
| ముఖసంధిభేదములు | ౧౨ |
| ప్రతిముఖసంధి | ౧3 |
| గర్భసంధి | ౧౨ |

| | |
|---|---|
| అవమర్శసంధి | ౧౩ |
| నిర్వహణసంధి | ౧౬ |
| చూళిక | ౧ |
| అంకాస్యము | ౧ |

ఇవి మొదలగునవి యనేకములున్నవి.

ఇప్పు డుపయోగము లేనందున వీటివిమర్శ వ్రాయలేదు. యివి యక్షగానముచే లోకములో భాగవతసేవాది నాటకములు వాడుకలోనున్నవి.

ఈయుత్తమ మధ్యమాధమములకు మూడింటికి గీతము తాళము నాట్యము అభినయము ఈ నాలుగును గలవు.

అభినయమువలన నిమ్మూడింటికి శ్రేష్ఠత గలిగినది.

## అభినయ వ్యుత్పత్తి

శ్లో॥ అభిపూర్వస్యనీఞ్ధాతో రాఖ్యానార్థస్య నిర్ణయః। యస్మాత్పదార్థాన్నయతి తస్మాదభినయస్స్మృతః॥ అనగా అభి యను ఉపసర్గమును ముందుగా గలిగిన నీఞ్ధాతువునకు ఆఖ్యానము అర్థమగుచున్నది అఖ్యాన మనగా వెనుక పాడుచుండెడు గీతోక్తములైన యర్థములను కటాక్షభుజాక్షేపములచేత దెలియజేయుట యేదిగలదో, యది యభినయమని చెప్పబడుచున్నది, గాన నీతౌర్యత్రికరూపకమయిన యభినయము సభారంజకము.

ఈ యభినయమున కుపయుక్తములయిన అంగకరణ విక్షేపాదులను శీర్షాది పాదాంతక్రమముగా వ్రాయుచున్నాను.

శిరోభేదములు—౬.

౧ ఉద్వాహితము=అనగా తలమీదికెత్తుట.

౨ అవధూతము=అనగా క్రిందికివంచుట.

౩ విధుతము = అనగా అడ్డముగా రెండుప్రక్కల ద్రిప్పుట.

౪ కంపితము = అనగా క్రిందుగమీదుగ శిరస్సు గదలించుట.

౫ ఆలోళితము=అనగా చక్రాకారముగా ద్రిప్పుట.

౬ పరావృత్తము=అనగా నొక్కప్రక్కకు ద్రిప్పుట.

వీట్లసాంకర్యములవలనను ననేకభావములు పుట్టుచున్నవి

దృష్టిభేదంబులు

౧ లలితము=అనగా మనోహరముగా జూచుట.

౨ కుంచితము=అనగా కొంచెము సంకోచించి చూచుట.

౩ వికాసము=అనగా స్ఫుటముగా నేత్రములు విచ్చి చూచుట.

౪ ముకుళము=అనగా కన్నులుమూసికొనుట.

౫ సాచి=అనగా కడకంట జూచుట.

౬ ప్రలోకితము=అనగా రెండుప్రక్కల ద్రిప్పుట.

౭ నిమీలితము = అనగా పైకి నల్లగ్రుడ్లుపోనిచ్చి సగముగా గాని ముక్కాలుగా గాని కన్నులు ఎగువకు మూయుట.

౮ శూన్యదృష్టి=అనగా కన్నులు తెఱచి యిచ్చట నిగహా లేక యెక్కడనో లోకముంచుట.

౯ ఉల్లోకితము=అనగా మీదికినిక్కించి మెల్లగా వంపబడినదృష్టి.

౧౦ భ్రమణదృష్టి = అనగా నల్లగ్రుడ్లు చక్రాకారముగా త్రిప్పుట.

౧౧ అనువృత్తము = అనగా క్రిందుమీదుగా వడిగా త్రిప్పుచు చూచెడి చూపు.

౧౨ ఉత్క్షిప్తదృష్టి=పైకిచూచుచు నిలిచియుండుట.

౧౩ అవలోకితము=అనగా క్రిందుగా జూచు చూపు.

ఇవి నేత్ర భేదములు. వీట్లసాంకర్యముచేత రత్యాది స్థాయీభావములును తద్గత సంచారీభావములును మొదలగు మానసికభావములును బ్రకాశింపజేయునవిగా నేర్పడుచున్నవి గాన వాట్ల వివరము బాహుళ్యమని వ్రాయలేదు.

## భ్రూభేదము ౫

౧ ఉత్క్షిప్త=అనగా కనుబొమ్మలను మీదికి నిక్కించుట.

౨ పతితము=అనగా రెండుకనుబొమ్మలు క్రిందికివంచుట.

౩ చతురము = అనగా రెండుకనుబొమ్మలు ఎడముగా దీయుట.

౪ కుంచితము=కనుబొమలు ముడివేయుట.

౫ రేచితము = అనగా రహస్యము వినునప్పుడు ఒక కనుబొమను వికృతిచేయుట.

## నాసాచలనభేదములు ౨

౧ వికాసము=అనగా సంతోషసమయములో ముక్కుపుటము లుబ్బించుట.

౨ సంకోచము=అనగా కోపాహాస్యాదిసమయములయందు ముక్కు సంకోచింపజేయుట.

అథోష్ఠచాలన భేదములు 3

౧ స్పందము=అనగా కోపాదిసమయములయందు పెదవి వణకుట.

౨ సంకోచము=అనగా మూతిముడుచుట.

3 వికాసము=అనగా హాస్యాద్భుతాదులయందు విప్పుట.

హాస భేదములు ౫

౧ స్మితము=అనగా చిఱునగవు.

౨ హసితము=అనగా సహజమైననవ్వు.

3 ప్రహసితము=అనగా ఒడలు తెలియని నవ్వు.

౪ అపహసితము=అనగా పరిహాసయోగ్యమగు నవ్వు.

౫ ఉపహసితము=అనగా ప్రథమములో నవ్వు గలిగిన దానికి కారణమును దలచుకొని మాటిమాటికి నవ్వుట.

గ్రీవా భేదములు ౪

౧ సుందరగ్రీవ=అనగా సుందరముగా నడ్డముగా త్రిప్పు మెడ. ఇదే అడ్డమని యందురు.

౨ ప్రకంపితము=అనగా ముందుకును వెనుకకును పావురమురీతిగ గదలించునది.

3 తిరశ్చీనము = అనగా నిరుప్రక్కలను సర్పమువలె గదలించునది.

౪ పరివర్తితము=అనగా నిరుప్రక్కలను అర్ధచంద్రాకారముగా గదలించునది.

వీట్ల సాంకర్యమువలనను ననేకభావములు పుట్టుచున్నవి-

హస్తచాలనభేదంబులు ౧౬

౧ ఊర్ధ్వస్థము=అనగా తలకంటె పైగా చేయియెత్తుట.

౨ అధోముఖము=అనగా క్రిందికిజాపుట.

౩ తిర్యక్కు=అనగా ప్రక్కలకు జాచుట.

౪ అపవిద్ధము = అనగా వక్షమునకు నెదుట మండలముగా త్రిప్పుట.

౫ ప్రసారితము = అనగా ముందుప్రక్కగా నాలుగు దిక్కుల త్రిప్పుట.

౬ ఉంచితము=అనగా ఱొమ్ము మొదలుకొని తలవఱకు రెండుమాఱులుగా త్రిప్పుట.

౭ మండలగతి = అనగా ప్రతిదిక్కునందును కత్తిద్రిప్పినట్లు త్రిప్పుట.

౮ స్వస్తికము = అనగా శిరస్సుపైన గృహాకారముగా రెండుచేతులు జోడించి క్రిందికివిప్పుట.

౯ ఉద్వేష్టితము=అనగా చేతులు వెలికివిసరుట.

౧౦ పశ్చిమాస్యము = అనగా భుజముమీఁదుగా వెనుకప్రక్కకు చేయిపోనిచ్చుట.

౧౧ ఆవిద్ధము = అనగా తనతొడప్రక్కను చేయి వెలికి మెమ్మదిగా విసరుట.

౧౨ కుంచితము=అనగా చేయియెత్తి వరలోనున్న కత్తిని తీసి కొట్టబోయినట్లు చేయిపైకెత్తి ఆచేతినే కొంచెము వంపుగా [illegible]చుట.

౧౩ నమ్రము=అనగా స్తుతించునప్పుడు చేతిని ముందుకు కొంచెముగా జాచియుంచుట.

౧౪ సరళము=అనగా పైకి క్రిందికి ప్రక్కలకు జాచు హస్తము.

౧౫ ఆందోళితము = అనగా ఠీవిగా నడుచునప్పుడు కదలించు బాహువు.

౧౬ ఉత్సారితము = అనగా వస్త్రమును దీసికొన్నట్లుగా ముందుకు జాచినచేతిని తనదగ్గరకు దీసికొనుట.

ఈ ౧౬ను సమస్తవిధ హస్తకరణములను బుట్టించుచున్నవి.

### ఉరశ్చాలన భేదములు ౪

౧ నిర్భుగ్నము = అనగా ఎదుటికి రొమ్ముతో గ్రమ్ముట.

౨ పార్శ్వసంఘట్టనము = ఇరుప్రక్కల రెండురొమ్ములతో మార్చి మార్చి క్రమ్ముట.

3 భ్రామణము = అనగా రొమ్ముతో నెదురించి నెఱుముట ఇది ఆలింగనాదులం దుపయోగము

౪ ఆభుగ్నము = అనగా రొమ్ము గుంటగా జేయుట.

### కటిచాలన భేదములు 3

౧ రేచిత = మల్లామునందు నిలిచి పిఱుదులు వెనుకకు బోవునట్లు కటివెనుకకు నెత్తుట.

౨ భిన్న=పిఱుదులు యిరుప్రక్కలకు బోవునట్లు కటిని అడవలయందు ఆడించుట.

3 ఉచ్ఛ్వాసిత = విలాస గమన సమయమందుండు నడ.

## ఊరుచాలన భేదములు 3

౧ కంపిత = మల్లామునందు రెండుతొడలులయాను సారము ఆడించుట

౨ నాగబంధము = రెండుతొడలు పెనవేయుట.

3 సంవృతవివృతము = ఆసనభేదాదులందు జంటించుట, విప్పుట.

## పాదకర్మ భేదములు ౧౯

౧ సమపాదము = అనగా రెండుపాదములు సమముగా ఆన్చి నిలుచుట.

౨ ఏకపాదము = అనగా నాట్యవిశేషాదులయందు నొకపాదముమోపి నిలుచుట.

3 వినివర్తితము = అనగా పాదములు మార్చుట.

౪ గతాగతము = అనగా ముందుకు వెనుకకు బోవుచు వచ్చుచు నుండుట.

౫ వళితము = అనగా తిరుగుట.

౬ వైశాఖమండలము = అనగా నిరుప్రక్కల దిరుగుట.

౭ త్రిభంగి = అనగా పాత్ర రేఖప్రమాణముమీద నిల్చునపుడు నడుము రొమ్ము శిరస్సు నివి వంపుగా నిలుచుట.

౮ అగ్రగము = అనగా మునివ్రేళ్లమోపు మీద నొక పాదమున కంటె నొకపాదమును ముందుముందుగా వడివడిగా నుంచుట.

౯ మర్దితము = అనగా నిల్చినచోటనే పాదములతో మెట్టుట.

౧౦ కుంచితము = అనగా పాదముల మొనవ్రేళ్లు నేల నాన్చి మడిమెలు పైకెత్తి నిక్కుట.

౧౧ అంచితము = అనగా మడిమెలు భూమియందు ఆన్చి వ్రేళ్లు పైకెత్తుట.

౧౨ పార్ష్ణిగము = అనగా మొనవ్రేళ్లుమోపి మడిమె లెత్తియుండి తిరుగా మడిమెలు ఆన్చి మొనవ్రేళ్లెత్తుట.

౧౩ ఘట్టితము = అనగా మడిమెలతో పట్టుట.

౧౪ ఘట్టితోత్సేధము = అనగా అరికాళ్లు నేలతగులకుండ ముడుచుకొని మడిమెలు కొనవ్రేళ్లు భూమియందు తట్టుట.

౧౫ సూచిపాదము = అనగా నొకపాదము సమముగా నేలనాన్చి మఱియొక పాదముయొక్క మడిమె యెత్తి ఆకాలియొక్క బొట్టనవ్రేలు భూమిమీద ఆన్చునది.

౧౬ తాడితము = అనగా మడిమెలమీద నిల్చి ముని పాదములు పైకెత్తి ఆమొన పాదములచేత భూమిని పట్టుట.

౧౭ పార్శ్వగము = అనగా పాదములయొక్క వెలి ప్రక్కలు నేలనాన్చి లోప్రక్కలు తగులకుండ నిల్చిగాని అట్లాగే ముందుకు అడుగు నుంచుచుగాని యుండుట.

౧౮ ఉద్ఘట్టితము = అనగా మునివ్రేళ్లతో నిల్వబడి మాటిమాటికి మడిమెలతో నేలనుపట్టుట.

౧౯ అగ్రతలసంచరము=అనగా మడిమెలెత్తుకొని వ్రేళ్లు భూమియందు ఆనకుండ అరికాళ్లయొక్క ముందుకొనలు నేల నాన్చి నిలిచిన చోటనుండుటగాని, ముందువెనుకను సంచరించుచు గానియుండుట.

పార్థివచారి భేదంబులు ౪.

౧ సమపాదము = అనగా రెండుపాదములు జంటించి యుంచి నటించుట.

౨ శకటవదనము = అనగా రెండుపాదముల బొట్టన ప్రేళ్లు నొకదానితో నొకదానిని బట్టుకొని నటించుట.

3 శుక్తి = అనగా రెండుపాదములు ముత్తెపుచిప్పల వలె కొంచెము అభిముఖములుగానుంచి నటించుట.

౪ మత్తల్లి=అనగా రెండుపాదములు పరస్పరము మెల్లగా నుంచినటించుట.

ఇవి రెండుపాదములు చేర్చి దుముకుటగాని, మెల్లగా జరుపుటగాని అనుకూలమయినలాగున నటించువాని పేర్లు.

వ్యోమచారి భేదములు 3.

౧ అపక్రాంతము = అనగా వెనుకకు పాదములెత్తుట.

౨ సూచీముఖము = అనగా ముందుకు పాదమెత్తుట.

3 డోలాపాదము = అనగా పాదమెత్తి వెనుకకు ముందుకు ప్రక్కలకు ఆడించుట.

భానుమండలభేదంబులు 3.

౧ ఆస్కందితము, ౨ భ్రమరము, 3 శకటాసనము. ఇవి నిలిచియున్నచోటనే తిరుగుభేదములు.

దైవమండలభేదములు ౪.

౧ అలాత, ౨ దండపాత, 3 లలిత, ౪ విచిత్ర, ఇవి నటించుచు వర్తులములుగాను విచిత్రముగాను తిరుగుటలో భేదములు.

కరణభేదంబులు ౧౦౮.

కటిభ్రాంతము = అనగా నడుమాడించుట.

దండరేచిత = అనగా సరిగా వంపులేక నిల్చుట.

లలాటతిలక = అనగా ముందుచేతులానించి పాదములు వెనుకనుండి లలాటము వఱకు రానిచ్చుట.

మయూరలలిత = అనగా ఒకటేటిన పాదములు పైకెత్తి మయూర పింఛము విచ్చినట్లు కనుపఱచుట.

చక్రమండల = అనగా నిల్చుకొని పాదములొన్ని మొగ్గవాలినట్లుగా వెనుకకువంగి చేతులు క్రిందచాచుక భ్రమణముగా దేహమును చుట్టుత్రిప్పుట.

నికుంచితము=అనగా దేహమును ముడుచుకువంచుట.

గంగావతరణము=అనగా ప్రక్కలకు నావవలెనే దేహమును వంచి చెంగలించుట.

ఇవిమొదలగునవి ౧౦౮ భేదంబులుగలవు.

అంగహార భేదములు.

౧ అపరాజిత=అనగా నెదురించుట.

౨ సూచికావిద్ధ=అనగా సూదివలె సన్నగా ఆకార గోపనముచేయుట.

౩ పరిచ్ఛిన్న=అనగా తన యాకృతిని కొద్దిజేయుట.

౪ విష్కంభ=అనగా ఆకృతిని విస్తారము చేయుట.

౫ రేచిత=అనగా చెంగలించుట.

ఈపైజెప్పిన శీర్షాది పాదాంతకరణ భేదములు ముఖ్యము లయినవి వ్రాసితిని వీట్లమేళనమువలన ననేకభేదములు గల్గుచున్నవి.

ఇకను పదార్థములను దెలుపునట్టి యసంయుత సంయుత హస్తముల వివరము వ్రాయుటకు నిది హస్తభాషయైనందున విశేష విపులముగా నుండుటచే తన్నామములుమాత్రము వ్రాయుచున్నాను వీట్లవినియోగవివరము ఆయాగ్రంథములలో జూడుడు.

అసంయుతహస్తములు అనగా ఒకచేతితో బట్టవలసినవి. ౩౧

| | | |
|---|---|---|
| ౧ పతాక | ౧౧ కపిత్థ | ౨౨ భ్రమర |
| ౨ త్రిపతాక | ౧౨ కటకాముఖ | ౨౩ హంసాస్య |
| ౩ అర్ధపతాక | ౧౩ సూచి | ౨౪ హంసపక్ష |
| ౪ కర్తరీముఖ | ౧౪ చంద్రకళ | ౨౫ సందంశ |
| ౫ మయూర | ౧౫ కోశ | ౨౬ ముకుళ |
| ౬ అర్ధచంద్ర | ౧౬ సర్పశీర్ష | ౨౭ తామ్రచూడ |
| ౭ అరాళ | ౧౭ మృగశీర్ష | ౨౮ త్రిశూల |
| ౮ శుకతుండ | ౧౮ సింహాముఖ | ౨౯ ఊర్ణనాభ |
| ౯ ముష్టి | ౧౯ లాంగూల | ౩౦ బాణ |
| ౧౦ శిఖర | ౨౦ సోలపద్మ | ౩౧ అర్ధసూచి |
| | ౨౧ చతుర | |

సంయుతహస్తములు అనగా రెండుచేతులతో బట్టవలసినవి. ౨౪

| | | |
|---|---|---|
| ౧ అంజలి | ౯ కటకావర్ధన | ౧౭ మత్స్య |
| ౨ కపోత | ౧౦ కర్తరీస్వస్తిక | ౧౮ కూర్మ |
| ౩ కర్కట | ౧౧ శకట | ౧౯ వరాహ |
| ౪ స్వస్తిక | ౧౨ శంఖ | ౨౦ గరుడ |

| | | |
|---|---|---|
| ౫ డోల | ౧౩ చక్ర | ౨౧ నాగబంధ |
| ౬ పుష్పపుట | ౧౪ సంపుట | ౨౨ ఖట్వా |
| ౭ ఉత్సంగ | ౧౫ పాశ | ౨౩ భేరుండ |
| ౮ శివలింగ | ౧౬ కీలక | ౨౪ అవహిత్థ |

ఈయసంయుత సంయుతహస్తములలో బాంధవ్య హస్తములు. ౧౧

| | |
|---|---|
| దేవతా హస్తములు. | ౧౬ |
| నవగ్రహ హ॥ | ౯ |
| దశావతార హ॥ | ౧౦ |
| చతుర్వర్ణ హ॥ | ౪ |
| ప్రసిద్ధరాజ హ॥ | ౨౮ |
| సముద్ర హ॥ | ౭ |
| పుణ్యనదీ హ॥ | ౧౪ |
| వృక్ష హ॥ | ౨౩ |
| సింహాదిమృగ హ॥ | ౨౧ |
| పక్షి హ॥ | ౨౧ |
| జలజంతు హ॥ | ౫ |

మన్మథ పంచబాణములకు ప్రయోగస్థలములు ఆయా బాణప్రయోగముచేసినప్పుడు గలుగు అవస్థావిశేషములు వ్రాయుచున్నాను.

౧ అరవిందము=స్త్రీస్తనములందు ప్రయోగము-దీని కార్యము ఉన్మాదము గలుగుట.

౨ అశోకము=ప్రయోగస్థలము అధరము దీనికార్యము రోదనము చేయుట.

3 చూతము=ప్రయోగస్థలము శిరస్సు దీనికార్యము సమ్మోహము చెందుట.

౪ నవమల్లిక=ప్రయోగస్థలము నేత్రములు దీనికార్యము దేహముశుష్కించుట.

౫ నీలోత్పలము=ప్రయోగస్థలము గుహ్యము దీని కార్యము మృతినొందుట.

ఈపంచమబాణ ప్రయోగోద్యోగము నభినయించి మరణోద్యోగమును గనుపఱచి బాణప్రయోగమును నిలుప వలయును ఏలనంటే మరణము నభినయించకూడదనుట నాటక సంకేత సిద్ధము గనుక యిట్లుచేయవలెను.

ఈ హస్తములలో ముఖ్యములయినవి వ్రాసితిని అసంయుత సంయుత హస్తములవలన నానావస్తువుల అర్థములు అలంకారములు ధ్వనులు శ్లేషలు ప్రపంచములో నెన్నిపదార్థములు గలవో వాని నన్నిటిని హస్తములచేత చూపించునవిగా నుండుటచేత నొక్కొక హస్తమునకు నానార్థములు చెప్పి యుండుటచేత నతివిస్తార మగుటచేత వ్రాయలేదు.

ప్రమేయము వచ్చినప్పుడు ఆయాగ్రంథములలో జూచుకొనవలయును. ఇదిగాక హస్తద్వాదశ ప్రాణములు అని గలవు. అవి వేళ్లుముడుచుటనుబట్టి చాచుటనుబట్టి చేయెత్తుటను బట్టి యిట్టిహేతువులనుబట్టి నిర్ణయించిన సంకేతములు గనుక యీ ద్వాదశప్రాణములు పిచ్చిసంగతులుగా నుండుటచేత నిందు వ్రాయబడలేదు.

## పేరిణీవివరము

దీని అంగములు ౫

౧ గర్ఘరము, ౨ విషమము, 3 భావాశ్రయము, ౪ కవివారకము, ౫ గీతము దీనిలక్షణములు విశేషముగా జెజరూపుగా నున్నవి. ఇందులో ముఖ్యము.

### పుష్పాంజలి ఇచ్చుట

అనగా పాత్ర, రంగమధ్యమునకువచ్చి పతాకహస్తములతో గరుడపక్షి రెక్కలవలె జేతులు పక్కలకుజాచి రేఖప్రమాణముగా నిలిచి సభానాయకుని గుడికంటజూచి యెడమకాలి మెడిమెకు కుడికాలి పెద్దవ్రేలుపూని అక్కడినుండి కుడివైపుగా ఆ బొటనవ్రేలును నేలమీద తేలికగా ఆన్చి గజ్జెలు అదరు లాగున ముందుకు కుడిపాదము రానిచ్చెను. ఈరీతిగ మూడు మారులు చేసి సరిగానిల్చి దండముపెట్టును. యిది పుష్పాంజలి. పటవాటము మొదలయిన అడవులకు సొల్లుచెప్పబడియున్నవి.

ఇందుకు ముఖ్యములయిన అడవులు ౬

౧ పటవాటము=అనగా రెండుపాదములు భూమియందు మోపి నృత్యముచేయుట.

మెడిమెలు భూమియందుమోపి నృత్యము చేయుట గూడ పటవాట మనంబడును.

ఈ అడవకు సొల్లు. తక తక తక.

౨ పటనము=అనగా రెండుపాదములును భూమిపయి నుంచి యొకపాదమునందు మఱియొక పాదాంగుళము లుంచి తట్టుట.

ఈ అడవకు సొల్లు. ధగ ధగ ధగ.

3 సూరివట్టెము=అనగా నొకపాదముతట్టి యురుటుగా వేయక పాదము పర్యాయక్రమమున నురుటుకొనుట.

సొల్లు. తక్కిటకిటతక తక్కిటకిటతక తక్కిటకిటతక.

౪ లకాదిమము=అనగా భూమిని లగ్నాగ్రములుగా రెండుపాదములును సరిగానుంచి పర్యాయమున మెడిమెలు భూమినాన్చుక నృత్యముచేయుట.

సొల్లు. దిర్గుడు దిర్గుడు దిర్గుడు.

౫ సిరిబిరము = అనగా సమపాదమందు నొకపాదము ముందఱ తట్టి వ్యత్యాసముగా రెండవపాదము కుదియదీసి తర్వాత ముందఱ నడిచినకాలు కుదియవేయుట.

సొల్లు. తుకుకుకు తుకుకుకు తుకుకుకు. మరియును భూమియందు స్వభావముగానున్న పాదాలు జంఘలచేత కుదిలించుట. ఈ అడవసొల్లు. దిగి దిగి దిగి.

౬ హాలాభిధము = అనగా భూమి లగ్నాగ్రమైవామాంఘ్రి యుండగా పార్శ్వములచేత దట్టి యన్యపాదముతో సవ్యాపసవ్యముగా నటించుట.

సొల్లు. తకుధికు తకుధికు తకుధికు.

ఈ ౬ అడవలయొక్క ప్రస్తారముచేత ననేకములయిన అడవలుపుట్టుచున్నవి గాబట్టి యూహించుకొనవలయును. ఆ అడవలకు సొల్లుకూడా పైలక్షణమునుజూచి చేర్చుకొనవలయును. గ్రంథవిస్తరభీతిచే వ్రాయలేదు. ఏయేలక్షణములను విపులముగా జూడగోరువారు ఆయాలక్షణశాస్త్రములను జూచుకొనవలయును.

నాట్యాభినయప్రకరణము సమాప్తము.

---

# శబ్దవాద్య ప్రకరణము

శబ్దములనుగురించి అనగా సొల్లులను గురించియు వాద్యములనుగురించియు జెప్పువిషయంబు గలది శబ్దవాద్యప్రకరణమనంబడును.

మర్దళాదివాద్య హస్తపాటనములకు కొనుగోలు క్రమము.

శ్లో॥ శివవక్త్రోత్థ పాటానాంస్వరూపం ప్రతిపాద్యతే తేషాముత్పాటకోత్పత్త్యా శ్లోకతో లక్షయేత్ సుధీః అని యున్నది. ఎట్లనగా, హస్తపాటనములకు శివునియొక్క సద్యోజాతముఖమువలన పుట్టిన సొల్లు.

| వేర్లు | | సొల్లులు |
|---|---|---|
| ౧ నాగబంధము | దీనికిసొల్లు | = నగి-నగి-నగి |
| ౨ పవనము | దీనికిసొల్లు | = నన-గిడ-గిడనగి |
| 3 ప్రత్యేకము | దీనికిసొల్లు | = గిడ-గిడ-తా |
| ౪ ఏకరసము | దీనికిసొల్లు | = కిక-త-తట-తట |
| ౫ పంచరసము | దీనికిసొల్లు | = కిక-తకిట |
| ౬ విక్షేపము | దీనికిసొల్లు | = ధోంగి-దోంగి |

వామదేవముఖము వలన గలిగినవి.

| | | |
|---|---|---|
| ౧ స్వస్తికము | దీనికిసొల్లు | = తత-కిట-కిట |
| ౨ వళికోహాళము | ,, | = దోహంత |
| 3 ఫుల్లవిక్షేపము | ,, | = దొంగిన-దొంగి-ధొంగిన |

౪ కుండలీవిక్షేపము దీనికిసొల్లు = ధోం - ధోం - గోం గోం
౫ స్వరవిలిఖి ,, = ధాగిణతాతా
౬ ఖండనాగబంధము ,, = కిటతోంధోంగినఖేనఖే
౭ పూరకము ,, = టకు ఝుం ఝుం

అఘోరవక్త్రోద్భవములైనవి.

౧ అలగ్నము దీనికిసొల్లు = తత కిట గిడెదగి తా
౨ సుసారము ,, = ధధకికి
౩ విశ్రామము ,, = తకిధిగి తకిధిగి
౪ విషమస్ఖలితము ,, = టకునగు టకునగు
౫ స్ఫురితము ,, = ఖరితు ఖరితు సరిసరి
౬ స్ఫురణము ,, = ఖరినరకి

తత్పురుషముఖజన్యములు.

౧ శుద్ధి = దీనికిసొల్లు దరికిట గిడదగదా
౨ స్వరస్ఫురణము ,, టటకు టటా
౩ ఉత్ఫుల్లము ,, ననగినన - ఖుననగిననఖు - ననగినఖరి
౪ వళితము ,, దంఖేదంఖేఖే
౫ అవఘట్టము ,, ధాంగినగి ధాంగినగి
౬ తకారము ,, తత్తా
౭ మాణిక్యావళి ,, ధిధి

ఈశానముఖోద్భవములు.

౧ సమస్ఖలితము=దీనికిసొల్లు నఝుోం నఝుోంఝుాం
౨ వికటము ,, గిరిగిడ గిరిగిడ
౩ సదృశము ,, కిణ కిణకి

౪ ఖలితముజ డింకిసొల్లు ధిధికిటకి
౫ అర్ధఖలితము ,, ధరికిన
౬ అసంయుక్తము ,, ధరికిటతా
౭ ఖండము ,, ధోంనక

ఇవి యీశ్వరపంచముఖములనుండి బుట్టిన హస్తపాటక సొల్లులు.

దీనిమీద ననేకములగు సొల్లులుపుట్టి సొల్లుప్రస్తార మేర్పడినది.

ఈసొల్లు దక్షిణహస్తమున వాయించవలసినవియు, వామహస్తముతో వాయించవలసినవియు విభజించి వ్రాసి యున్నవి. అందుకు నొకశ్లోకము వ్రాయుచున్నారు.

శ్లో. అంగుష్ఠాదక్షిణోహస్త పుటాచ్ఛేష్టహాదన్యకేత్,
స్వపుటం కిడయేత్వామ ప్రదా హాత్యంతరోభవేత్.

అని యీలాగున విభజించియొకరు కుడి తెలిసి వాయించుటకు అనేకములు వ్రాయబడియున్నవి.

ఇవి తెలిసి యీసొల్లును వాద్యములో కుడియెడమ హస్తములతో వాయించి మద్దెల వాద్యములో నోటిసొల్లు పలికినట్లు శబ్దము పలికించుచు వాయించువాడు లక్షణజ్ఞుడనం బడును. అట్టివాడు తనవాద్యమునకు సొల్లు నోట ననగల్గును.

అట్లు లేక కుడియెడమ హస్తపాటనములు తెలియక తప్పు గాను, తాళలయను సరిగాను వాయించుచు సొల్లు నోటబలికి నట్లు వాయించజాలని వానిని లయజ్ఞానియని మాత్రము చెప్ప వలెనేగాని లక్షణము తెలిసి వాయించు వానిగా జెప్ప గూడదు — ముఖ్యముగా వైణికవీణ యగుకంఠము వలన

గానము జేయు మనుజుని గాత్రమునకు సరిగా లక్షణ లక్ష్యము లను జూపించుటకు మానుషీవీణయగు నచ్యుతరాయ వీణ యెట్టిదో ? అలాగే నోటబలికించు సర్వశబ్దములకును సరిగా బలికించి చూపంపగిన వానిలో మర్దళము మొదటిది. అందులో బలికినన్ని శబ్దములు కడమ వాద్యములలో బలుకవు.

సంగీతసూర్యోదయాది గ్రంథములలో ననేక తాళ ములకు సొల్లులేమి, ఒక్కొక్క తాళమునందు త్రికాలవిన్యాస ములుగా వాయించవలసిన జతులు వ్రాసియున్నారు.

ఈశబ్దముల పేర్లు.

మృగేంద్రహుంకృతి శబ్దము లనియు గజేంద్రబృంహిత శబ్దము లనియు అశ్వప్లుతాది శబ్దము లనియు ఘనగర్జన శబ్దము లనియు మండూకశబ్దము లనియు శకుంతశబ్దము లనియు వాట్ల వాట్ల శబ్దరూపములను బట్టి నామ నిర్దేశములు చేసియున్నారు.

శబ్దవాద్య ప్రకరణము సమాప్తము.

---

# పాండిత్య రహస్య ప్రకరణము

---

ఈవిద్యలు గల విద్వాంసుల తౌర్యత్రిక పాండిత్య మర్మములను దెలుపు విషయంబులు గలది, పాండిత్య రహస్య ప్రకరణం బనంబడును.

## వైణిక పాండిత్యము

వైణికుడు ఎడమచేతనే మీటి, యెడమచేతనే స్వరము లణచుచు వాయించుటయు, నోట నొకరాగము - పాడుచు.

చేతనొకరాగము పలికించుటయు మధ్యమగ్రామములో శ్రుతి గూర్చి రాగము వాయించితే, యేయేస్వరము, యేయే మెట్ల మీద నడచవలయునో, షడ్జగ్రామ శ్రుతిజేసి సదరు మెట్లమీద వాయించితే, యివి ఫలానారాగమని, యేర్పడకయుండును.

ఇది యెందుకంటే యెదుట వీణాపండితుని పరీక్షించుటకు ఉపయోగించుచున్నది.

ఇంతేగాక, పాటయొక్క యుక్తాక్షరమునకే మీటు వేసి సంగతి గమకమునకు మీటువేయకుండనే సంగతిని వాయించుట.

మఱియు పక్కతంత్రులమీద శ్రుతిమీటు వేయకనే వాయించు తంత్రులందు మీటుశబ్దము "టిం" అని శబ్దించ కుండ మృదువుగా వేలిపొట్టతో లోమీటుమీటి యొఱయిక మొదలగు గమకములు పట్టి స్త్రీ, నోటపాడినట్లు వాయించుట. ఇవి మొదలగునవి వైణిక పాండిత్యములు.

## గాయక పాండిత్యము

పల్లవిపాడెడువాడు స్వరము పాడుటలో, నేతాళములో నైనను మార్గకాలము చతురశ్ర త్రిశ్ర మిశ్ర ఖండాదిగతు లుగా స్వరముపాడుటయు, నొకయావృత్తములోనే విలంబ మధ్యమద్రుత లయములుగా స్వరము పాడుటయు, మూడు నాలుగు ఆవృత్తములకు విలంబ మధ్యమద్రుతములుగాగాను విన్యాసములుగాగాను బాడుటయు, సభానాయకుని యనుమతి మీద రెండేసి మూడేసి యావృత్తములకు వేఱువేఱు రాగ ములు పాడుటయు గ్రహప్రాణభేదముల ప్రకారము పల్లవి

పాడుటయు షణ్మార్గములుగా బాడుటయు. పల్లవిముక్తాయిలో నొకటిగాగాని రెండుగాగాని మూడుగాగాని వాద్యకుడెత్తి చ్చిన ప్రకారము శబ్దముగాని లేక స్వరముగాని ముక్తాయీల యందు తప్పకపాడుటయు, నిట్టివి గాయకుని చాతుర్యములు.

## వాద్యకుని పాండిత్యము

పల్లవి పాడువాడు తన్నకారముగాని స్వరముగాని త్రిశ్రమిశ్రాది విన్యాసములు చేసి పాడినను కొనుగోలిచ్చువాడు గాని వాద్యకుడుగాని, పల్లవి యెత్తుగడ ప్రథమాక్షరము కాడికి "తదిగిణథ" అని మూడావృత్తులు ముక్తాయి సరిపుచ్చు టయు, నివ్విధముగానే "ధికుతకతధిగిణథ" అనిగాని యింక కొంతసొల్లుజేర్చి గతివిన్యాసమయిన ముక్తాయినిగాని యిది ౧ గాని ౨ గాని 3 గాని పల్లవియొక్క ప్రథమాక్షరమునకు సరి పుచ్చుటయు.

మఱియు చతురశ్రజాతి త్రిపుటతాళములో పల్లవి పాడగా త్రిశ్రగతిగా వాద్యము జరపి పైప్రకారముగాముక్తా యీలు సరిపుచ్చుటయు, నిదేరీతిగ త్రిశ్రమిశ్ర ఖండాది జాతి తాళములకును ప్రత్యేకప్రత్యేకముగా నేతాళమునకైనను భిన్న మయిన యేకజాతి గాగాని పైజెప్పిన జాతీయగతులు సంకర ములుగాగాని వాయించి పైముక్తాయీలు పల్లవి యొక్క యాద్యక్షరమునకు సరిపుచ్చుటయు.

మఱియు నేతాళములో పల్లవి పాడితే మిశ్రజాతి త్రిపుట. అట్లానే ఖండజాతి త్రిపుట లేకసప్తతాళములలో స్వజాతిలోగాని, యన్యజాతిలోకాని, యుండు నేతాళముల కయినను పరస్పరతాళాక్షరముల సంపక లక్షణముమీాద సరి

చేసి వాయించుటయు, లేక కొనుగోలిచ్చుటయు చేయుట. ఇందుకు పంచకక్రమమును, చతురశ్రజాతి త్రిపుట ౮ అక్షరముల కాలమును, త్రిశ్రజాతి త్రిపుట ౭ అక్షరముల కాలము. దీని సరిపుచ్చు పంచకము పెట్టిన, ఎనిమిదేళ్లు ౫౬ పంచకములు ౫౬ ఈక్రమానను చతురశ్రజాతి త్రిపుట ౮ అక్షరములు ౭ ఆవృత్తములు లెక్కించితేను, త్రిశ్రజాతి త్రిపుట ౭ అక్షరములు ౮ ఆవృత్తములు లెక్కించితేను ౫౬ సరిపోవుచున్నవి. ఇదేరీతిగ నేయేతాళములను బట్టియైనను ఈప్రకారము పంచకము సరిచేసితే సర్వతాళములకు సరిపోయి అప్పటికి ముక్తాయి అన్నింటికిని సరిగా వచ్చుచున్నది.

మరియు పాటపాడువాడు తాళాంగములుకాని గుద్దు చాటున వేసికొనుచు పాడినను వాయించువాడు తాళల యాక్షరకాలములను బట్టి పల్లవి యావృత్తములకు నిన్నియక్షరముల కాలమని యెఱిగి తాళము నిర్ణయించుకొని సరియు ముక్తాయింపులు పల్లవి ప్రథమాక్షరమునకుంటగా ముక్తాయింపు యిచ్చుటయు, నిదిగాక మూడు ముక్తాయింపులిచ్చుటలో కొన ముక్తాయిలో దూరముగా మూడు ముక్తాయి లిచ్చుట.

హిందూస్థాన సంప్రదాయములో కృతియొక్క యావ్యక్షరమునకు సరిగా ముక్తాయింపు వాద్యకుడు నిచ్చుటలేదు. ఇకనెట్లనగా కృతియొక్క పల్లవికిని అనుపల్లవికిని చరణమునకును అంత్యాక్షరమునకును సరిగా ముక్తాయింపు నిచ్చుటగలదు. ఇదివినువారికి బాగాయుండునుగాని వాద్యగానికి శ్రమ తక్కువ యగును.

ఇవి మొదలగునవి వాద్యకుని చాతుర్యములు.

## అభినయించు పాత్రచాతుర్యము

లోకములో స్త్రీపురుషులు మంచి రసజ్ఞులయినవారు పరస్పరబద్ధానురాగము గలిగియుండు పురుషునిగా సభానాయకునిగా నెంచి తనకు సతనితోఁ గలుగు సంభోగ విప్రలంభ శృంగారములయందు నేవిధమయిన యఱమఱిక లేక యా నాయకునితో బాహ్యరతిక్రియ లేమి విభావానుభావ సాత్త్విక సంచారిభావము లేమి విరహసమయములో దశావస్థ లేమి యారోపితములుగాక వాస్తవములుగా దనకుగలిగినట్లు గనుపఱచుట.

అప్పుడు చూచెడు సభ్యులకు నాట్యరంగమని తోఁచక వాస్తవముగా రహస్యతరుణమని తోఁచునట్టు లభినయించుట.

నాట్యవిషయములో ననేకములయిన గజ్జెలదండ, పాదములకు గట్టియుండినను ఆయాసమయములలో నన్నిగజ్జలు మ్రోగునవిగాను, కొన్నికొన్ని సమయములలో ౧౦ లేక ౪ లేక ౧ ఈప్రకారము గజ్జలు మ్రోగునటు లివమీఁద నటించుట.

చతురశ్ర తిశ్ర మిశ్ర ఖండాదిజాతులు గలిసిన విన్యాసముగాను నొకజాతిలో నటించి మఱియొకజాతిలో ముక్తాయింపు చేయుటగాను ఒకటిగాని రెండుగాని మూఁడుగాని ముక్తాయింపు లిచ్చుట.

మూఁడు ముక్తాయింపులిచ్చుటలో, కొనముక్తాయిలో దూరముగా మూఁడు ముక్తాయిలిచ్చుటగాను నటించుటయు.

అంగ, కరణ, విక్షేపాదులయందు తగ్గు నిగ్గు జగ్గు సొల్లు ఇవి మొదలగువాట్లలో మదగజమువలె కనుపఱచుట.

శిరోభ్రూనేత్ర నాసాధర గ్రీవ వక్షః కటి చాలనములు, మృదుమనోహరములుగాను బాహుచాలనములు అభినయ సమయములలో అనగా తగ్గ, జగ్గ, సొల్రాక్, ప్రత్యా, తిర్యగాదిసమయములయందు పాదసాంచార విన్యాసములను సరిగా మనోహరముగాను సలుపు అభినయములనుబట్టి వ్రాసిన చిత్రప్రతిమవలెనే చూచువారికి గనబడునట్లు కనుపఱచుటయును—

ఆడి అలసినసమయమునందు మనోహరముగా ౘ సంగతులు వేసి పాడుటయును.

ఇది శ్లో॥ సువస్మృదితా బాలరసితా చనమూ్న శోభంతే॥ అను వచనప్రకారముగ శ్రమస్వేదబిందువులు ముఖమునందు ప్రకాశించుచుండగా తఱచుగా శ్వాసములు వచ్చుచుండగా దగ్గుత్తికతో సంగతులుపాడుట యత్యమనోహరముగా నుండును—ఇవి పాత్రచాతుర్యములు.

## నట్టువకాని చాతుర్యము

నట్టువకాని చాతుర్యము పాత్ర ఆడునప్పుడు సరిగా శానుగోలిచ్చుట, తాళముతట్టుట ఇది పాత్రను చేయూతగా నుండును.

పాత్ర యభినయించుసమయములో ఆయారసభావానుగుణ్యముగా మృదుమధురప్రాక్షేయ విరహోత్సాహ కోపాది భావోద్బోధకములు పాత్రకు గలుగునట్లుగా నయనిష్ఠురాది సంగతులువేసి పాడుట.

ఇందువలన పాత్రకు రసభావాదులు ప్రకాశించుటకు ప్రోత్సాహపఱచుటగా నుండును.

మఱియు పాత్రకు నభినయము చెప్పుటలో సుత్ప్రేక్షో శ్లేషాశ్లేషలు అసంలక్ష్యధ్వనులు ఛలోక్తులు కాక్వర్థములు, ఇత్యాదుల నభినయించునట్లు హస్తములు చెప్పుటయు తక్కినవి పైన వ్రాసిన పాత్రపాండిత్యములకు హేతువులయినవి చెప్పుటయు నివి నట్టువకాని చాతుర్యములు.

ఈ గ్రంథములో వ్రాసిన ప్రకరణముల నొప్పు శాస్త్రములనేకములుగలవు.

ఒక గ్రంథములో నైనను లక్షణలక్ష్యములకు అవ్యాప్త్యతివ్యాప్త్య సంభవాదిదోషములు లేకయుండ లేదు. ఒక ప్రకరణమును జెప్పు ననేకశాస్త్రములలో పరస్పరవిరోధములున్నవా ? యని యడుగనేల? ఇందుకు "ఈశాస్త్రములను పైపై చూడవలెనేగాని లోతుకుపోయి తర్కింపగూడదు అట్లయితే రసము చెడును. ఎట్లనగా పుష్పమును నలుపకుండా వాసనజూడవలెనేగాని నలిపిచూచితే వాసనచెడును. అట్లు యీగ్రంథములను పైపైచూడవలెను." అని ప్రాచీన వ్యాఖ్యాతలు చెప్పిరి, గాన నిట్టి శాస్త్రములు చూచి వ్రాసిన నాయందు దోషారోపణము చేయగూడదు.

అయితే ఆయాసభాయోగ్య శాస్త్రసంకేతములను గొంతమట్టుకు సులభముగా దెలియుటకు దేలికయగుమాటలతో సంగ్రహముగా వ్రాసినందుకు సంతోషింపవలయును.

మఱియు శ్రీగీతార్థసారసంగ్రహము, మనస్సాక్ష్యము, నాస్తికధ్వాంతభాస్కరము, సర్వమతసారసంగ్రహము రత్నషట్కాంగుళీయకము, నిర్గుణవాద నిరాకరణము, ఈ సభారంజని అను నీ గ్రంథములు అందఱకు దెలియుటకు లోక

వాడుక మాటలుగాను అతిసంగ్రహముగాను నేను వ్రాసితిని. ఇంతేగాక పద్యములు మొదలుగాఛందోబద్ధములుగా రచించిన యెడల యతి గణ ప్రాసనిర్బంధములవలనను, వ్యర్థవిశేషణములు పూరించవలసియుంటున్నది. అందువలన వ్యుత్పత్తిక్రమమును బట్టి తాత్పర్యభేదములు ఇతరులు కల్పించుటకు అపార్థములు చేయుటకు వలనగలుగును.

ఇందువలన ఛందోబద్ధము గాకున్నందున వ్యర్థవిశేషణములు లేక ఉత్పత్తిక్రమము అందఱికి స్పష్టమగుటకు నీ ప్రకారముగ నింగ్లీషుగ్రంథములవలె మాటలుగా రచించితిని. ఇంతేగాక నాయొక్క అభిప్రాయము అందరికి తెలియుటకు వ్రాసితిని. గాని కవితాచమత్కారము తెలియవలెననిగాని అందువలన బహుమతు లందవలెననిగాని, లేక మహాకవి నని కీర్తిబొందవలెననిగాని యుద్దేశ్యముండి యీ గ్రంథములు రచించినవాడను గాను గనుక నా యుద్దేశ్యమునకు అందఱు సంతసింతురని నమ్మెదను.

సంపూర్ణము.

# అభిప్రాయము

'సభారంజని' అనెడి యీ గ్రంథము వెలుగోటి సర్వజ్ఞకుమార యాచేంద్ర భూపాలునిచే రచింపఁబడిన భరతశాస్త్రమును గూర్చిన లక్షణ సంగ్రహము. ఇందు భరత శాస్త్రాంగములయిన భావరాగతాళములలోని ముఖ్యవిషయములు విమర్శింపఁబడి ఇదమిత్థములుగా నిశ్చయింపఁబడినవి. భావప్రకరణమందు నాయికా నాయకాదిభేదములగూర్చియు రసభావముల గూర్చియు లోనగువిషయములు పరామర్శింపఁబడినవి. అటులనే రాగప్రకరణమందు శ్రుతిస్వరరాగరాగాంగాదులవిషయము పరామృష్టంబగుటయేగాక వీణావాదనమునుగూర్చి ముఖ్యముగా వివరింపఁబడినది. ఇందునుబట్టి చూడ నీగ్రంథకర్త వైణికశిఖామణిగ సంగీతానుభవముగలవాడని తెలిసికోనగుచున్నది. ముఖ్యముగా గ్రామములు వాదిసంవాద్యాదులు దశవిధగమకములు వీణాదశప్రాణములు అనుదానిగూర్చిన సంగ్రహవివరణము అతి సంగ్రహమయ్యును అనుభవద్యోతకమగుచున్నది. ఇక తాళప్రకరణమందు స్పృశింపఁబడిన దశప్రాణాదివిషయసమస్తమును అనుభవగోచరమగుచున్నది. ముఖ్యముగా మార్గప్రాణమును గూర్చిన ప్రశంస ప్రశంసింపఁదగియున్నది. ఇవి యిటులుండ హిందూస్థానీరాగతాళప్రకరణమనెడి అయిదవ ప్రకరణమందు హిందుస్థానీ రాగతాళసంప్రదాయములుగూడ సంగ్రహముగా వివరింపబడినవి. ఇందువలన నీగ్రంథరచయిత హిందుస్థానీగానమందుగూడఁ బ్రగల్భుడై యుండనోపునని తెలిసికోదగుచున్నది. నాట్యాభినయప్రకరణము అను ఆరవప్రకరణమందు నృత్తగీతవాద్యములను తౌర్యత్రికమందలి నృత్తమునుగూర్చిన సంగ్రహచర్చయందు నృత్తాంగప్రధానములగు నాట్యాభినయములగూర్చి విశేష

విమర్శన మొనర్పఁబడి హస్తాదులను గూర్చినవిశేషవివరణము చేయఁబడినది. అటులనే శబ్దవాద్యప్రకరణమునవేద మృదంగాదివాద్యములందుపయుక్తంబు లగుసొల్లులు అనగా నోటఁగొనుగోలు చేయుఁతకధికిటత్యాదిశబ్దములగూర్చిన విషయములు సంగ్రహింపఁబడినవి. పాండిత్యరహస్యప్రకరణమనెడి చివరి ప్రకరణమందు గాయకవైణికనాటకాదులపాండిత్యమన్న నెట్టిదో నిరూపింపఁబడినది. మొత్తముమీద గ్రంథకర్త భూపాలశేఖరుఁడయ్యును భరతమనియు తౌర్యత్రికమనియు సంగీతమనియు చెప్పఁగఁబడు నృత్తగీతవాద్యముల సమన్వయించి స్వానుభవపూర్వకముగా పాఠకులకు నివేదింపఁబూనిన మహావైణిక గాయకశేఖరుఁడని గ్రహింపనగును. ఇట్టి మహారాజు ఆంధ్రుఁడైయుంట ఆంధ్రులు గర్వింపఁదగినవిషయము. ఇట్టి మహారాజులు వర్ధిలునప్పుడే దేశమున గాయకవరిష్ఠులు తగిన సత్కారాదిపోషణములభించి విద్యకును దేశమునకును వన్నెగల్పింపఁగలరు.

ఓంతత్సత్ !!

ఇట్లు
'వాగ్గేయకారరత్న' ఇత్యాది
హరినాగభూషణము

మచిలీపట్టణము
5-9-48

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1949

# సంస్కృత గ్రంథములు

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| బాలరామాయణము, పెద్దచ్చు | ... | 0 | 2 |
| బాలరామాయణము, సటీక | ... | 0 | 4 |
| శ్రీమద్రామాయణము, మూలమ మాత్రము | ... | 6 | 0 |
| ,, మేలుప్రతి | ... | 8 | 0 |
| ,, సుందరకాండము, మూలము | ... | 2 | 0 |
| ,, ఉత్తరకాండము, రఫ్ ప్రతి | ... | 0 | 12 |
| ,, సటీక, 15 వాల్యూములు | ... | 70 | 0 |
| ,, వ్యాఖ్యానచతుష్టయవిశిష్టము 2 వాల్యూములు | | 25 | 0 |
| ,, అరణ్యకాండము, ఆంధ్రతాత్పర్యము | | 3 | 0 |
| ,, కిష్కింధాకాండము ,, | ... | 3 | 0 |
| ,, సుందరకాండము ,, | ... | 4 | 0 |
| ,, యుద్ధకాండము ,, | ... | 5 | 0 |
| కాశీమాహాత్మ్యము, తెలుగువచనము | ... | 0 | 12 |
| గయామాహాత్మ్యము, ,, | ... | 0 | 10 |
| సింహాచలక్షేత్రమాహాత్మ్యము ,, | ... | 0 | 12 |
| కేదారఖండము, పాతప్రతి | ... | 0 | 12 |
| జగన్నాథమాహాత్మ్యము, తెలుగు | ... | 0 | 3 |
| ధనుర్మాసమాహాత్మ్యము, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 3 |
| శ్రీమహాభారతము, గచ్ఛద్వ్యాఖ్యానసహితము 3 సంపుటములు | | 40 | 0 |
| శ్రీమద్భాగవతము, శ్రీధరీయవ్యాఖ్యానసహితము, 2 ,, | | 15 | 0 |
| శ్రీమద్దేవీభాగవతము, సవ్యాఖ్యానము | ... | 15 | 0 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్ చెన్నపురి